A. R. D. P. P. No. 4

మన

# వర్గసంబంధాలు

## యం. యన్. రాయ్

ఆంధ్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ,
తెనాలి.

నాలుగణాలు

# ప్రపంచయుద్ధం-భారతదేశ కర్తవ్యం

నాలుగణాలు

"ఈ పుస్తకంలో జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను బట్టి కాంగ్రెస్ ఉద్యమం ఎలా నడిపించాలో చర్చించారు. నేటి రాజకీయాలను తెలుసుకో దలచిన ప్రతివారు చదువతగ్గ పుస్తకం." ప్రజామిత్ర.

"సరసమైన వ్యావహారిక భాషలో చక్కగా వుంది." ఆంధ్రప్రభ.

# మరోమార్గం

ఆరణాలు

"రాజకీయ పరిజ్ఞానం గల కాంగ్రెసు వాదు లందరూ ఈ పుస్తకం చదివి చాలా లాభం పొంద గలరు. నిజంగా మరోమార్గం యొక్క ఆంతర్యం కాంగ్రెసు వర్కర్లకు బోధపడాలంటే పుస్తకం చివర కాంగ్రెసు ప్రణాళిక గలదు. ఇప్పటి కాంగ్రెసువ్యవస్థ సజీవంగా ఉండాలి అంటే ఇందలి సూచనలు చాల వరకు అనుసరించబడాలి." ఆంధ్రవారపత్రిక.

# యం. యన్. రాయి జీవితం

నాలుగణాలు



# మన
# వర్గ సంబంధాలు



## యం. యస్. రాయ్

"Marxism is not circumscribed by time and space. Marxism existed even before Marx was born.........Jacobinism is the shadow of Marxism cast ahead."

అనువాదం:

జి. వి. కృష్ణరావు

ప్రతులకు :

1. రాడికల్ యూనిట్,
   కూచిపూడి, తెనాలి తాలూకా.

2. ఏ. వరద,
   రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ కార్యాలయం,
   అప్లాండ్సు, వాల్తేరు.

3. యం. వి. శాస్త్రి, బి. ఏ., బి. యల్.,
   కాకినాడ.

# మాటా—మంతి

మన దేశీయ భాషల్లో, ముఖ్యంగా మన తెలుగు భాషలో, రాజకీయ గ్రంథాల కొరత ఎక్కువగావుంది. మనదేశం లాంటి దేశాలకు—బానిసతనంలో వున్న దేశాలకు—రాజకీయ పరిజ్ఞానం విరివిగా కావాలి. ఈ ఉద్దేశ్యంతోనే మేము రాజకీయ గ్రంథాల్ని ప్రచురిస్తూ వున్నాము. ముఖ్యంగా యీరోజుల్లో—మనకు కావలిసింది గాంధిజమో, నేషనలిజమో, సోషలిజమో తెలిసికోలేని పరిస్థితుల్లో — మన దేశీయ వర్గ సంబంధాలు యేవిధంగా వున్నాయో, వీటివల్ల మనం ఏ "యిజాన్ని" అవలంబించాలో ప్రజలు తెలిసికోవాలనే మేము యమ్. యన్. రాయ్ వ్రాసిన "Relation of classes"ను అనువదించి ప్రకటిస్తూ వున్నాము.

ఈ పుస్తకాన్ని యెప్పటినుంచో తెలుగులో ప్రకటించాలని ఆతురతతో వున్నాము. కాని ధనాభావం చేత యింతవరకు ఆగక తప్పినది కాదు. మాయీ ఆతురత చూచి, ధనాభావాన్ని తొలగించి యీ పుస్త

కము వెలువడటానికి సహాయపడ్డ మిత్రులకు మా కృత

జ్ఞతాపూర్వక వందనాలు.

మా యీ పుస్తకాన్ని దేశం నిష్పాక్షికంగా, విమ

ర్శనా దృష్టితో పరిశీలిస్తుందని మా నమ్మకం — ఇదే

మాకు పదివేలు.

22—9—41 }
సూచిప్పాడి } ప్రచురణకర్తలు.

మార్క్సిజం పరిణామం చెందుతూ వున్న సామాజిక జీవిత తత్వాన్ని చెబుతుంది. ఆధ్యాత్మిక వాదంలాగ ఈ సిద్ధాంతం వాస్తవాన్ని భ్రాంతి అని త్రోసివేయదు; వాస్తవంగా సమాజం ఎలాగ ఎందుకున్నదో, ఎలా మారటానికి వీలుందో, ఎలా మార్చవచ్చునో స్పష్టీకరిస్తుంది. అంతేగాని, యిదే సత్యం; హేతుహేతుమద్భావం ఎలావున్నా నమ్ము, నమ్మితేనే ముక్తి, అని చెప్పే భక్తి యోగం కాదు. మార్క్సిజానికి సామాజిక జీవితాన్ని మార్చటమే ప్రధానం కాని, విశ్వ ప్రాదుర్భావాన్ని విశదీకరించటం మాత్రంకాదు.

ఇలాంటి మార్క్సిజానికి ప్రాతిపదికలు మూడు : (1) చారిత్రిక భౌతిక సిద్ధాంతం, (2) సర్‌ప్లస్ ఉత్పత్తి, (3) వర్గాల పోరాటం. ఈ ప్రాతిపదికల్ని అర్థం చేసికోకుండ మార్క్సిజాన్ని అర్థం చేసికోటానికి వీల్లేదు. ఈ మూడు ప్రాతిపదికలు ఆధ్యాత్మిక వాదంలోని దేవుడు, జీవుడు, ప్రకృతి లేక మాయ అనే వాటికంటె భిన్నమై

నవి. మార్క్సిజంలోని ప్రాతిపదికలకు ప్రత్యక్షమే, అంటే, సమాజమే ప్రమాణం. ఆధ్యాత్మిక వాదంలోని ప్రాతిపదికలను నమ్మాలి. నమ్మక ప్రశ్నించినవాడు పాషండుడౌతాడు.

మార్క్సిజంలోని మొదటి ప్రాతిపదికయైన చారిత్రిక భౌతిక సిద్ధాంతం తత్వానికి సంబంధించినవి; సర్ప్లస్ ఉత్పత్తి ఆర్థిక శాస్త్రానికి సంబంధించినది; వర్గాల పోరాటం రాజకీయానికి సంబంధించినది.

ఉన్న ఆర్థిక విధానాన్నిబట్టి సామాజిక వ్యవస్థ ఉంటుంది. సామాజిక వ్యవస్థనుబట్టి వర్గాలు, వాటి పరస్పర సంబంధాలు ఏర్పడుతాయి. ఈవర్గ సంబంధాలను బట్టి తేవలసిన విప్లవ స్వభావమూ, సామాజిక జీవనంలో వచ్చే మార్పూ నిర్ణయింపబడుతాయి. పురుష ప్రయత్నం లేకుండ అవ్యాహతంగా సమాజంలో విప్లవం ఎప్పుడూ రాదు.

కాబట్టి విప్లవం తేవాలంటే పురుషప్రయత్నముండాలి. అయితే యీపురుషప్రయత్నం ఉన్న పరిస్థితుల్ని, అంటే, ఉన్నవర్గాలనూ, వాటి పరస్పర సంబంధాలనూ గుర్తించి మరి సాగాలి. అప్పుడే విప్లవం నెగ్గుతుంది. వీటిని

గుర్తించి తదనుగుణంగా నడవకపోతే, నేల విడిచిన సాము చెయ్యట మౌతుంది.

మనదేశంలో దారిద్ర్యం పిలిస్తే పలుకుతూవుంది. ఇలాంటి ఘోరదశ మన కెందుకు వచ్చింది? ఎట్లా యీ దుర్దశనుంచి తప్పించుకోవడం?

గాంధేయులు మన దుస్థితికి సామ్రాజ్యప్రభుత్వమూ యంత్రమూ కారణాలంటారు. సామ్రాజ్య ప్రభుత్వం కంటె కూడ యంత్రమే ముఖ్యకారణ మన్నట్లు వీరు తలపోస్తున్నట్లు కనిపిస్తూవుంది.

ఇక సోషలిస్టులమని చెప్పుకునే వారి పంథాకూడ చెప్పవలసి వుంది. వీరు స్థూలంగా చెప్పబడ్డ వర్గాలే సర్వకాల సర్వావస్థలందూ, దేశభేద, ఆర్థిక భేదాలను గుర్తించకుండ వుంటాయని భావించి మార్క్సిజానికి సంకుచితభావం కల్పిస్తున్నారు. ఎప్పుడు నోరు విప్పినా, జమీందారులు, బూర్జువాలు, పెటీబూర్జువాలు, కార్మికులు అనేపదాలు తప్ప మరొకపదం రాదు. ఈ వర్గాలు మనదేశంలో వున్నాయో, లేవో, బలాబలాలు ఎలా వున్నాయో వీరు గమనించటం లేదు. కార్మికులు తప్ప మిగతా వారంతా వీరిదృష్టిలో విప్లవవిద్రోహులే.

అసలు జమీందారు, కాపిటలిస్టు, బూర్జువా, పెటీ బూర్జువా, కార్మికుడు, శ్రామికుడు, అంటే సరియైన అభిప్రాయం సోషలిస్టులమని రొమ్ము విరుచుకొని తిరిగే వారిలో చాలమందికి లేదు. మన సమాజంలో ఈవర్గాల నిష్పత్తి ఎలా వుందో అర్థం చేసికొన్న వారి సంఖ్య చాల స్వల్పంగా వుంది. మార్క్సిజమంటే వాస్తవికత్వాన్ని గుర్తించటమే ననికూడ మరచిపోతున్నారు. అందువల్ల స్థూలంగా చెప్పబడ్డ విషయాలను మన సమాజానికి అంటగట్టి సూక్ష్మాతి సూక్ష్మ విషయాల్లోకి పోలేక పోతున్నారు. అందువల్ల విప్లవ పంథా అంటూ ఒకటి తిన్నగా ఏర్పడలేదు.

మన దేశం సక్రమంగా అభివృద్ధి చెందక ఆగిపోయింది. దీనికి పరదేశ దండయాత్రలు ముఖ్యకారణం. ఇలా కణసపారిపోయిన జమీందారీ విధానంలో ఉన్న మన దేశాన్ని ఇంగ్లీషుసామ్రాజ్యప్రభుత్వం జయించింది. అందువల్ల బూజుపట్టిన జమీందారీ ఆర్థిక విధానం, సామ్రాజ్య ప్రభుత్వపు టార్థిక విధానం మన దేశంలో చెట్టపట్టాలు కట్టుకుని విహరిస్తున్నాయి. అందువల్ల మన సమాజంలోని వర్గ సంబంధాలను అర్థం చేసికోవటం తేలిక కాదు.

ఒక ప్రక్క జమీందారులు. సామ్రాజ్య ప్రభుత్వం; మరొక ప్రక్క జమీందారీ విధానంలోనుంచి ఊడిపడ్డ బూర్జువాలు ఉన్నారు. కాపిటలిజం బయలుదేరినప్పటి యూరప్‌లోని పరిస్థితులతో మన యీ స్థితిగతుల్ని పోల్చటానికి వీల్లేదు. ఎందుకంటే, ఆ రోజుల్లో యూరపులో ఈ యువవయోవ్యాకత్వాల్లో కాపిటలిజం ప్రక్కన లేదు. పైగా ఆరోజుల్లోలాగా ఇప్పుడు ఏ దేశాన్ని తతిమ్మా ప్రపంచాన్నుంచి విడదీసి చూట్టానికి వీల్లేదు.

అందువల్ల మన దేశంలో అటు పూర్తిగా జమీందారీ విధానానికి సంబంధించక, ఇటు పూర్తిగా కాపిటలిజానికి సంబంధించక, వర్గాలు ఒక నూతన పంథాలో కలగాపులగంగా, ఖచ్చితంగా విడదీయటానికి వీల్లేకుండా ఉన్నాయి.

యం. యన్. రాయ్ వీటి నన్నిటిని గుర్తించి ఇప్పటి మన వర్గ సంబంధాలు ఎలా ఉన్నాయో, ఏవిప్లవం రావటానికి వీలుందో, ఎవ్వరిని ఎలా వ్యవస్థాపించాలో చక్కగా చర్చించి చూపించాడు.

స్వాతంత్ర్యం సంపాదించాలన్న ప్రతివ్యక్తీ, విప్లవం తెచ్చి మన సమాజాన్ని బాగుపరచుకొందామనే ప్రతి మార్క్సిస్టూ యీ పుస్తకాన్ని చదివి తీరాలి.

అనువాదకుడు

# వర్గసంబంధాలు

—:o:—

ఇకముందు జరుగవలసిన విప్లవంయొక్క తత్వం తెలుసుకోవాలంటే, వర్గాలంటే యేమిటో, సామ్రాజ్య ప్రభుత్వమంటే యేమిటో తెలిసికోవాలి. ఈ రెండు శబ్దాల అర్థం స్పష్టపడితేనేగాని యీ వర్గసంబంధాలనుగూర్చి యిదమిత్థమని చెప్పుకోవటానికి వీల్లేదు. ఈ రెండు శబ్దాలనూ తరచు వాడుతూనే వుంటారు. ఐతే వీటిని అర్థంచేసుకొని వాడటంలేదు. ఇవి పుస్తకాలలో కనిపిస్తున్నాయి, కాబట్టి అర్థంచేసుకోకుండానే వీటిని యథేచ్ఛగా వాడుతున్నారు. ఈ రెండు శబ్దాలకు సరియైన అర్థం చెప్పుకోగలినవారు చాల తక్కువ.

## వర్గాల నిర్మాణం

ఇతర దేశాలలో మాదిరిగా మనదేశంలో కూడా మానవసమాజం వర్గాలుగా విభజింపబడి వుంది. ఈ

వాక్యంతోనే వర్గసంబంధాలను తెల్సుకోవటానికి వీల్లేదు. మనదేశంలో ఈవర్గ విభజన సరిగా లేదు. కాబట్టి మనదేశంలోని వర్గసంబంధాలను తెల్సుకోవాలంటే, మన సమాజ నిర్మాణాన్ని గూర్చి తెలుసుకోవాలి. వర్గ సంబంధాలు కేవలం సామాజిక నిర్మాణంమీద ఆధార పడి వుంటాయి. మన సమాజంలో ఇది ఫలానివర్గం, ఇది ఫలానివర్గం, అని స్పష్టంగా విడదీసి చెప్పటానికి వీల్లేదు. సక్రమంగా అభివృద్ధి చెందుతూవున్న సమాజం లోనే వర్గభేదాలు స్పష్టంగా కనిపిస్తాయి. మనసమాజం సక్రమమైన మార్గంలో అభివృద్ధి చెందలేదు. ఇలాంటి అసహజమైన అభివృద్ధి బ్రిటిష్ ప్రభుత్వం వచ్చి నప్పటినుంచే ప్రారంభం కాలేదు; ఈ సక్రమంకాని అభివృద్ధి అంతకు పూర్వమే ప్రారంభమైంది. యూరప్‌లో ఇప్పుడుకాని, వెనుకటి రోజుల్లోకాని, కనిపించే వర్గాలను మన సమాజంలో కూడా చూపించాలంటే, తప్పుడు త్రోవలు త్రొక్కవలసి వస్తుంది. ఇలాంటి పొరపాట్లు చాలమంది చేస్తూనే వున్నారు. మాట మాటకూ బూర్జువావర్గమనీ, జమీందారీ వర్గమనీ, కార్మిక వర్గమనీ వాడుతూ వుంటారు. ఈ వర్గాలన్ని చోట్ల ఒకేవిధంగా వుంటాయనీ, మార్కిస్టులైనవారు

వర్గాలను గూర్చి మాట్లాడేటప్పుడు ఈ శబ్దాలనే వాడా లని నియామక మైపోయింది. ఈ వర్గాలు అసలు మన సమాజంలో వున్నాయా, లేవా, అనే విషయంతో నిమిత్తం లేదు. ఇలాంటి మూఢనమ్మకాలే మార్క్సిజం అనే పేరుతో చెలామణి అవుతున్నాయి. ఇలాంటి మూఢవిశ్వాసాలతో మనకు నిమిత్తం లేదు. సమాజంలో ప్రత్యక్షంగా వున్న వర్గాలే మనకు కావాలి కాని, వర్గాల పేర్లతో నిమిత్తం లేదు. అప్పుడే మనం వివిధ వర్గాలకు మధ్యవున్న సంబంధాలను సరిగా తెలుసుకో గలుగుతాము.

బూర్జువా అనేపదాన్ని ఉదాహరణగా తీసుకొందాం. సాధారణంగా డబ్బున్నవాళ్ళందర్నీ బూర్జువా అని పిలవటం పరిపాటై పోయింది. చిన్నపట్టణాల్లోని ధనికు లను కూడా బూర్జువాయిజీగా పరిగణిస్తే చాల ప్రమా దాలు తటస్థిస్తాయి. ప్లీడరైనా, డాక్టరైనా, జమీం దారైనా, వర్తకుణ్ణైనా, వడ్డీవ్యాపారం చేసేవాణ్ణైనా, డబ్బుంటేసరి, బూర్జువా అనేస్తున్నారు. వీరందరిని ఒక వర్గంగా పరిగణించటం చాల పొరపాటు. ఇలాంటి సంకుచిత దృష్టితో చూస్తే సమాజస్థితి బోధపడదు. ఇది కేవలం దయాదాక్షిణ్యాలను పురస్కరించుకొని చేసే

పని. అంటే, భాగ్యవంతు లంతా దుర్మార్గులనీ, నీతి దూరులనీ, పేదవాళ్ళంతా మంచివాళ్ళనీ చెప్పట మన్న మాట. ఇలా పేదవాళ్ళని ప్రోలిటేరియట్ అనీ, పీడిత ప్రజా సామాన్యమనీ చెప్పటం మార్క్సిస్టు దృక్పథం కాదు. ఇలా చేయటంవల్ల వర్గభావాన్ని సంకుచితంచేసి అపార్థం కల్పించట మౌతుంది. ఇలా చేయటానికి రెండు కారణా లున్నాయి. ఒకటి: మన దేశంలో మార్క్సిజం సరిగా అర్థంచేసుకోవటంలేదు. మార్క్సిజాన్ని ప్రచారంచేసే వారు కూడా సరిగా అర్థంచేసుకున్నట్టు లేదు. రెండు: వస్తుతః మార్క్సిజం తేలిగ్గా అర్థం చేసికోటానికి వీలైన సిద్ధాంతం కాదు. వర్గభేదాలను సరిగా గుర్తించ గలిగిన సమర్థులకు కూడా యిది ఈ వర్గం, యిది ఈ వర్గం, అని ఖచ్చితంగా చీల్చి తేల్చి చెప్పటం కష్టసాధ్యం. ఈ పుస్తకంలో ఇకముందు జమీందారులు ఎలా కాపిట లిస్టులయిందీ సూచించబోతున్నాను. నిజానికి వస్తే, యిప్పటి మన సమాజంలో చాలమంది ఒక విధంగా చూస్తే జమీందారులుగాను, మరొక విధంగా చూస్తే కాపిటలిస్టులుగాను ఉన్నారు. స్వదేశ సంస్థానాధిపతుల్లో చాలామంది ఆధునిక పరిశ్రమల్లో పెట్టుబడి పెట్టారు. ఐనా వారిని బూర్జువా వర్గంగా పరిగణిస్తే చాల పొర

పాట్లువస్తాయి. హిందూదేశంలో ఒకడే కాపిటలిస్టుగాను, బూర్జువాగాను ఉండవలసిన అగత్యంత లేదు. ఒకడు బూర్జువా కావచ్చును; కాని కాపిటలిస్టు కాడు. ఇంకొకడు కాపిటలిస్టు కావచ్చును; బూర్జువా కాడు. ఈ కారణంవల్ల పెటీబూర్జువా అనే శబ్దాన్ని చాల అపార్థం చేసుకుంటూ వున్నారు.

## జమీందారీవర్గం

వర్గవిషయంలో వాడే పారిభాషిక శబ్దాల నిర్వచనాలను ఎత్తుకుందాము. మొదట జమీందారీ వర్గాన్ని తీసుకుందాము. జమీందారీవిధానాన్ని పలువురు పలు విధాలుగా నిర్వచించారు. సమగ్రంగా చదువుకొన్న మార్క్సిస్టుల్లోకూడా ఈ నిర్వచనవిషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి; ఏకీభావం లేదు. సరియైన శాస్త్రీయ దృక్పథం లేకపోవటంవల్లనే ఈ అభిప్రాయభేదాలు వచ్చాయనటానికి వీల్లేదు. అసలు జమీందారీవిధానమే ఒక విధంగా లేదు. ఇతరదేశాల్లోని జమీందారీవిధానం కంటె మన దేశంలోని జమీందారీవిధానాన్ని నిర్వచించటం మరీ కష్టం. ఇప్పుడు మన దేశంలో కాపిటలిజం ప్రక్రమమార్గంలో అభివృద్ధిచెందక ఆగినట్లే, జమీందారీ

విధానంకూడా, రాజపుతానాలోని కొన్ని భాగాల్లో తప్ప, సక్రమంగా అభివృద్ధి చెందలేదు. ఏది యెట్లున్నా జమీందారీవిధానం మన దేశంలో శతాబ్దాలనుంచీ వస్తూనే వుంది. ఇప్పటి మన సమాజంకూడా చాల వరకు జమీందారీవిధానంలోనే వుంది. కాని మనలో చాలమందికి ఈ జమీందారీవిధానాన్ని గూర్చి బాగా తెలియదు. మన రైతులకు జమీందారీమనస్తత్వం ఉందంటే చాల మంది విస్తుపోతారు. కాని రైతులు జమీందారీవర్గానికి సంబంధించినవారు అంటే తప్పు దారులు తొక్కటమౌతుంది. ఎలాంటి ఆర్థికవిధానంలో రైతులు వుంటారో, వారి మనస్తత్వంకూడా ఆ ఆర్థిక విధానానికి అనుగుణంగా వుంటుంది. జమీందారీ ఆర్థిక విధానం అమల్లో వున్న సమాజంలో వుంటూవున్నప్పుడు, సమాజంలోని అందరి మనస్తత్వమూ జమీందారీవిధానానికి అనుగుణంగా వుంటుంది. జమీందారీ రైతుయొక్క మనస్తత్వం జమీందారీయుగానికి సంబంధించిందే. జమీందారీఆదర్శాన్ని, ఇది జమీందారులది, ఇది రైతులది, అని విభజించి వేరుపరచటానికి వీల్లేదు. " భూమి జమీందారులది; వారిభూమిని నేను చేస్తున్నాను. వారికి శిస్తు వగైరాలు చెల్లించి, వారి

అధికారాన్ని పాలించటం నా ధర్మం," అని అనుకుంటే, రైతు మనస్తత్వం జమీందారీవిధానంలోనే నమస్తున్న దన్నమాట. జమీందారు ఇచ్చే భూమిమీద కాక, వేరే స్వేచ్ఛగా జీవనోపాధిని సంపాదించుకోటానికి వీల్లేనంతకాలం, అతని మనస్తత్వం జమీందారీవిధానానికి అనుగుణంగా వుంటుంది. అలాంటి జమీందారీవిధానానికి అనుగుణమైన మానసికతత్వాన్ని బ్రాహ్మణ్యాన్ని లేక మతప్రచారకులు రైతుల్లో రేకెత్తిస్తారు. మన దేశంలోని రైతుకి మతమనేది శల్యాశల్యాంలోను జీర్ణించి పోయింది. కిసానుప్రచారాన్నలా వుంచి, రైతుతో మాట్లాడితే, భూమి జమీందారులది; జమీందారు లేకుండా యెలా జరుగుతుంది ? అంటాడు.

భూస్వామి లేక దున్నుకోటానికి భూమి వుండదు. భూమి లేక రైతు బ్రతకడు. కాబట్టి అతనికి జమీందారుతో సంబంధ లేకుండా వుండటానికి వీల్లేదనిపిస్తుంది. ఇలాంటి సిద్ధాంతము మన రైతులోకంలో రాజ్యం చేస్తూనేవుంది. ఇలావున్న రైతుల్ని ఒకవర్గంగా పరిగణిస్తే ఈ వర్గం విప్లవకారి కా దనటంలో అసత్యం లేదు.

కాని యేవర్గ ప్రాముఖ్యాన్నైనా విచారించేటప్పుడు రెండు విషయాలు గమనించాలి. ప్రత్యక్షంగా

చూస్తే మన కర్షక వర్గం విప్లవకరంగా వుంది. ఇప్పటి పరిస్థితుల్ని పూర్తిగా మార్చి స్తేనే కాని, ఇప్పటి దుర్భర స్థితిలోనుంచి బయట పడటానికి వీల్లేదు. విప్లవం తీసుకొని రావలసిన ఆవశ్యకతను గుర్తి స్తేనే కాని విప్లవం తీసుకొని రావటానికి వీల్లేదు. అంటే, తన స్థితిగతులు అతిదుర్భరంగా వున్నాయని రైతు గ్రహించాలి. ఇలాంటి స్థితిగతుల్ని భగవంతుడు తెచ్చిపెట్టాడు; వీటిని మార్చెయ్యటానికి వీల్లేదు; ఇది సృష్టిధర్మం; అందువల్ల మానవ మాత్రు డేమీ చెయ్యలేడనే మూఢ విశ్వాసం పోవాలి. ఈ దుర్భరస్థితిగతుల్ని ఎలా మార్చటానికి వీలుందో రైతు గ్రహించాలి. పైగా మార్పుతెచ్చి తన స్థితిగతుల్ని బాగు చేసుకోవా లన్న దృఢసంకల్పం ముఖ్యంగా కావాలి. దీన్ని పురుషప్రయత్నం అంటారు.

## సర్ ప్లస్ ఉత్పత్తి అంటే యేమిటి ?

కర్షకవర్గం ఎలా విప్లవకారి అవుతుంది, అని తేల్చుకోటానికి పూర్వం ఒక విషయం తేల్చుకోవాలి. దీన్ని తేల్చుకోకముందు కొన్ని శబ్దాలకు నిర్వచనం చెప్పుకోవాలి. జమీందారీ విధానమంటే అసలుత్పత్తికి కారకుడైన వాడికి మిగిలేఫలసాయాన్ని (సర్ ప్లస్ ఉత్పత్తి)

కొంచెంకూడా మిగలకుండా దోచుకునే ఆర్థిక విధానం.

ఈ నిర్వచనమే దాదాపు సరిపోతుంది. ఉత్పత్తికి కారకుడైన వాడికి కొంచెం కూడా మిగలకుండా యెలా చేస్తారు? శిస్తులద్వారానా? ఇతర మైనపన్నులద్వారానా? ప్రత్యక్షంగా జరుగుతుందా? పరోక్షంగా జరుగుతుందా? పెద్దపెద్ద వడ్డీలద్వారా గుంజుకుంటారా? అనేది వేరే విషయం. ఇంకా ముందుకు పోయే ముందు మిగిలే ఫలసాయం (సర్ప్లస్ ఉత్పత్తి) అంటే యేమిటో చెప్పుకోవాలి. సామాజిక అభివృద్ధికి కృషి (లేబర్) మూలం. అభివృద్ధికి హేతుభూతమైన కృషి, మిగిలే ఫలసాయాన్ని, అంటే, సర్ప్లస్ ఉత్పత్తిని కూడబెడుతుంది. సమాజంలో ప్రతివాడు కేవలం తన జీవనోపాధికి కావలసినంత వరకే ఉత్పత్తి సాగించి వూరుకుంటే, అభివృద్ధి అనేది వుండదు. ఏసమాజంలో ప్రతివాడు తనకు కావలసినంత వరకే ఉత్పత్తి చేసుకొని వూరుకుంటాడో, ఆసమాజం అభివృద్ధి జెందక కుళ్ళుతూ వుంటుంది. మానవులు సామాజిక జీవులై కలిసి పని చేస్తే, వారిజీవనోపాధికి కావలసిన దానికంటే యెక్కువగా ఉత్పత్తి చేస్తారు. జీవితానికి కావలసిన దాని

కంటె యెక్కువ ఉత్పత్తిచేస్తే, ఆ మిగిలే ఫలసాయాన్ని సర్ప్లస్ ఉత్పత్తి అంటారు. ఈ సర్ప్లస్ ఉత్పత్తి సమష్టికృషి సాగినకొద్దీ అధికమౌతూ వుంటుంది. ఇలాంటి సర్ప్లస్ ఉత్పత్తి అవిచ్ఛిన్నమైన అభివృద్ధికి మూలమౌతుంది.

జమీందారీ సమాజంలో రైతులే ముఖ్యంగా ఉత్పత్తికి కారకులు. రైతు తనకూ, తనకుటుంబానికీ కావలసినదాన్ని పండిస్తాడు. అంతేకాదు, పుట్టేపిల్లా జెల్లా యెదగటానికి కూడా కావలసినది యిందులోనే వుంటుంది. మానవుడు తానొకడే బ్రతికితే చాలదు. అతడు పనిపాటలు చేయలేక మూలబడ్డప్పుడూ, మరణించిన తరువాత, భూమిని సాగుచేయటానికి సంతానాన్ని పొంది, దాన్నికూడా పోషించాలి. తానొక్కడే తనశరీరపోషణ చేసుకుంటే, అది పోషణ క్రిందికి రాదు. మానవుడు తాను బ్రతకటానికీ, జాతి అభివృద్ధి కావటానికి కావలసిన ఆహారపదార్థాదికాన్ని ఉత్పత్తి చెయ్యాలి. ముఖ్యంగా ప్రతిసామాజిక జీవి యిలాంటి ఆవశ్యకతలకైనా తగినంత ఉత్పత్తి చేయవలసి వుంటుంది. ఈమాత్రమైనా మానవుడు ఉత్పత్తి చేయలేకపోతే యేమీ వుత్పత్తి

చేయలేనివారికి, స్థానమే వుండదు. వర్గయుతమైన సమాజంలో మానవుడు తన కుటుంబానికి అవసరమైనంతైనా ఉత్పత్తి చెయ్యాలి. జమీందారీ సమాజంలో ఇలాంటి ఆవశ్యకతలకు సరిపోగా మిగిలే ఫలసాయమంతా రైతుదగ్గర్నుంచి జమీందారు గుంజుకుంటాడు. అంటే రైతుకీ, అతని కుటుంబానికీ, కేవలం బ్రతకటానికి కావలసినది తప్ప మిగిలిన ఫలసాయాన్ని (ఉత్పత్తిని) అంతా జమీందారీ వర్గం దోచుకుంటుంది. కాబట్టి జమీందారీయుగంలో జమీందారీకి రైతు అవసరం. రైతు కాలక్రమేణ కొంత వెనక వేసుకొని, ఏ కారణంవల్లనైనా తన జీవితంమీద విరక్తి చెంది, భూమి విడిచిపెట్టి, మరొకవిధంగా జీవించగలిగేటట్లైతే, అతడు జమీందారీ రైతుకాడు. జమీందారీ ఆర్థిక విధానం ఎంతసేపటికీ రైతుకి కొంచెంకూడా మిగలకుండా చేసి, ఎప్పుడూ భూమిని కనిపెట్టుకుని వుండేటట్టు చేస్తుంది. రైతు భూమిని అంటిపెట్టుకుని వుండటానికి చట్టం ఒక్కటే కారణంకాదు. జమీందారీవిధానం వుండాలంటే, ఎక్కువమంది పనిచేసేవారు ఉండాలి. అందువల్ల జమీందారీవిధానం ప్రజను కర్షకదశలోనే వుంచుతుంది. భూమిని విడిచిపెట్టగూడదు,

అని రైతుని అను శాసించే చట్టం. యిలాంటి జమీందారీ ఆర్థిక విధానాన్ని పురస్కరించుకొని వచ్చినదే.

## జమీందారీ ఆర్థిక విధానం

జమీందారీ ఆర్థిక విధానం సామాజిక అభివృద్ధికి ఆటంక పడుతుంది. సమాజ పోషణకు అన్ని విధాల కావలసిన దానికంటె ఎక్కువగా ఉత్పత్తి చేయడానికి మిగిలే ఫలసాయాన్ని (సర్‌ప్లస్ ఉత్పత్తిని) వినియోగించనపుడు, ఆర్థిక విధానం కుళ్లుతూ వుంటుంది. జమీందారు, రైతు దగ్గర్నుంచి వసూలు చేసేదాన్ని వ్యవసాయాభివృద్ధికి కావలసిన కాలువలు, ఆనకట్టలు, వగైరాలకు వినియోగిస్తూ వుంటే, సామాజిక అభివృద్ధికి పాటుబడట మౌతుంది. కాని జమీందారీ ఆర్థిక విధానంలో ఇలాంటిది జరుగదు. ప్రతి సంవత్సరం మిగిలే ఫలసాయాన్ని వసూలుచేసి, జమీందారులు ఇంకా ఉత్పత్తి చేయటానికి వినియోగించరు. ఇలావచ్చే ఆదాయాన్ని తామే మ్రింగివేసి, సామాజిక అభివృద్ధిని అరికడుతూ వుంటారు. అందువల్ల ఒక దశలో జమీందారీ విధానాన్ని కూలద్రోయవలసిన అవసరం వస్తుంది. క్రొత్తపంథా త్రొక్కి ఉత్పత్తిని సాగించే టందుకూ,

దాని ద్వారా సామాజికాభివృద్ధి చేకూర్చటానికీ, యిలాంటి పరిస్థితి అవసరం. కేవలం రైతులకే కాక, తతిమ్మా సమాజానికికూడా, ఇలా అభివృద్ధికి ఆటంకకరంగావున్న జమిందారీ వర్గాన్ని కూలద్రోయవలసిన ఆవశ్యకత యేర్పడుతుంది. ఒకవర్గానికీ, మరొక వర్గానికీ శత్రుత్వ మున్నంతమాత్రాన రెండో వర్గం నాశనం చేయబడదు.

ఒకవర్గం తతిమ్మావర్గాల అభివృద్ధికి అడ్డంతగి లేటప్పుడు నాశనం చేయబడుతుంది. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే, ఒకవర్గం బీదదైనంతమాత్రానగాని, దోచుకోబడుతున్నంతమాత్రానగానీ విప్లవకరం కాదు. ఆ వర్గం యొక్క శ్రేయస్సు తతిమ్మా సమాజంయొక్క శ్రేయస్సుతో యేకమైనప్పుడే, ఆ వర్గం విప్లవకరంగా వుంటుంది; ముందుండి విప్లవాన్ని కొనసాగిస్తుంది. అంటే, ఒకవర్గం, తతిమ్మా సమాజానికంతకూ దాస్యవిముక్తి కలిగించి, తానుకూడా స్వాతంత్ర్యం సంపాదించుకుంటుంది.

మన సమాజంలోని వర్గసంబంధాలను సరిగా తేల్చుకుంటే, యే వర్గం విప్లవకరంగా వుంటుందో తేల్చుకో

వచ్చును. అంటే, యేవర్గ శ్రేయస్సు తతిమ్మా సమాజం యొక్క శ్రేయస్సుతో యేకీభవిస్తుందో చూడాలి. దీన్ని దృష్టిలో వుంచుకొని అలాంటి వర్గంకోసం అన్వేషిద్దాము.

ఇంతకుముందు జమీందారీ ఆర్థికవిధానం ఎలా వుంటుందో తెల్సుకున్నాము. దానినిబట్టి యిప్పటి మన రైతాంగం రైతువారీవిధానంలో వున్నా, జమీందారీ విధానంలో వున్నా, చాలవరకు జమీందారీ ఆర్థికవిధానంలోనే వుంది. సరే, వొప్పుకుంటాం. పంజాబులోను, మదరాసురాష్ట్రంలోను, మహారాష్ట్రంలోను, జమీందారులు లేరుకదా! ఇలా సగం దేశంలో జమీందారులు లేనప్పుడు, మన రైతాంగం ఇంకా జమీందారీ విధానంలోనే వున్నదనటానికి యెలా అవకాశముంది? అని అడుగవచ్చును. ఆయారాష్ట్రాలలో జమీందారీ విధానానికి బదులు సామ్రాజ్యవిధానం వుంది. ఈ సామ్రాజ్య విధానం కూడా రైతుల దగ్గరనుంచి మిగిలే ఫలసాయాన్ని (సర్‌ప్లస్ ఉత్పత్తి) యావత్తూ గుంజుకుంటూ వుంది. ఇలాగే వలసరాజ్యాలను చేస్తున్నది.

సామ్రాజ్యవిధానం కూడ అంతర్వైరుధ్యాల వల్ల సామాజికాభివృద్ధికి తోడ్పడటం లేదు. మనం చర్చి

స్తున్న విషయాలను తేల్చుకోటానికి, సామ్రాజ్యవిధా నంలో వున్న అంతర్వైరుధ్యాలను గూర్చి కూడ తెలుసుకోవాలి.

## సామ్రాజ్య విధానం

కాపిటలిజం అభివృద్ధి చెంది సామ్రాజ్య విధానం వచ్చింది. ఈ కాపిటలిజం బూర్జువా విప్లవ విజయ ఫలితంగా వచ్చింది. అందువల్ల సామ్రాజ్యవిధానంలో బూర్జువా విప్లవ బీజాలుంటాయి. సామ్రాజ్య ప్రభుత్వ నాగరికతతో బ్రిటన్ మనదేశాన్ని జయించింది. మన దేశాన్ని ఇంగ్లండ్ జయించిందంటే, బూర్జువా విప్లవ బీజాలుకూడ తెచ్చిపెట్టిందన్నమాట. మన దేశంలో స్థిరాస్తి విషయంలో బ్రిటిష్‌ప్రభుత్వం తెచ్చిపెట్టిన మార్పులే ఈ విషయాన్ని తెలియజేస్తున్నాయి. ఐతే బ్రిటిష్‌ప్రభుత్వం మనదేశంలోని జమీందారీవిధానాన్ని నాశనం చెయ్యలేదు. రాజకీయంగా మన జమీందారులకు అధికారం లేకుండా చేసింది, ఆర్థికంగా అలాగే వుంచింది. బ్రిటిష్‌ప్రభుత్వం ఇలాచెయ్యటానికి కారణం వుంది. బ్రిటన్‌లో బూర్జువా విప్లవం కొంతవరకే జరిగింది. రాజకీయాధికారం బూర్జువాయిజీకి సంక్రమించిన

తరువాతకూడా బ్రిటిష్ జాతీయ ఆర్థికవిధానంలో జమీందారీ విధానాన్ని ఒక ముఖ్యభాగంగా అట్టి పెట్టారు. అందువల్లనే జమీందారీ పలుకుబడిని సూచించే రాచరికాన్ని యింకా కాపిటలిస్టు ప్రభుత్వం అట్టిపెట్టింది. అందువల్లనే ఇంగ్లండుకు రాజు ఉన్నాడు.

ఏది యెట్లున్నా, బ్రిటిష్‌సామ్రాజ్య ప్రభుత్వం మన దేశంలో బూర్జువా విప్లవ లక్షణాలను తెచ్చిపెట్టింది. అవసరమున్నప్పుడే బూర్జువా విప్లవంవల్ల వచ్చే సామాజిక రాజకీయపు మార్పులు వస్తాయి. ఇది మనదేశానికి కూడా అన్వయిస్తుంది. బూర్జువా విప్లవం బయలుదేరి, తదనుగుణమైన సామాజిక రాజకీయపు మార్పులు రాబోయే సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం మనదేశానికి వచ్చింది. మన దేశంలో రావలసిన మార్పుల్లో కొన్నిటిని తీసుకొచ్చింది. అందువల్లనే బ్రిటిష్ ప్రభుత్వం మనదేశంలో నిలవటానికి నీడ దొరికింది. అంతేకాని, క్లైవు ఫోర్జరీవల్లకాని, మీరాఙ్ఞాఫరు చేసినమోసం వల్ల కాని, వారన్ హేస్టింగ్సు చేసిన తంత్రంవల్ల కాని, డాల్‌హౌసీకున్న విశ్వాసం వల్లకాని, యిది జరుగలేదు. ఇవే సరైనకారణాలైతే, ఆసేతుహిమాచలం వ్యాపించి యున్న ఇంత పెద్ద దేశం, కొన్ని వేలమైళ్ల దూరంనుంచి

వచ్చిన కొలది మంది ఇంగ్లీషు వర్తకులకు ఎలా స్వాధీన మైంది? సామాజిక ఆస్కారం లేకుండా, యింతకాలం, ఎంత బలవత్తరమైన ప్రభుత్వమైనా యెలా నిలుస్తుంది? ఇండియాలో పాతుకుపోయి బ్రిటిష్ ప్రభుత్వం ఇంత కాలం నిల్చిందంటే, ప్రజాబాహుళ్యంలోని ఒక పెద్ద శాఖకూ, బ్రిటిష్ ప్రభుత్వానికీ సహకారం వుండి తీరాలి. అంటే, యీ ప్రభుత్వానికీ, ఈ శాఖకూ కలసివచ్చిన లాభం ఒకటి వుండాలి. ఈరోజుకీ అదే కనిపిస్తున్నది. ముందుకూడా అలాంటిదే వుండవచ్చును. కాని బలాల సంబంధం మాత్రం మారుతూనేవుంది. మొదట్లో కొన్ని వర్గాల లాభాలు బ్రిటిష్ ప్రభుత్వ లాభాలతో ఏకీభవించాయి. తరువాత ఇతరవర్గాల లాభాలు బ్రిటిష్ ప్రభుత్వ లాభాలతో ఏకీభవించాయి. బ్రిటిష్ ప్రభుత్వం ఇంకా హిందూదేశంలో నిలవాలంటే, యేదో ఒక వర్గసహాయం పొందాలి. బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వం బూర్జువా విప్లవవిజయంవల్ల ఏర్పడింది. కాబట్టి హిందూదేశంలో కూడా కొన్ని విప్లవవిధుల్ని నిర్వర్తించింది. పైగా అంత రిస్తూవున్న జమీందారీ ఆర్థిక విధానానికి జీవం పోసి జమీందారుల మాదిరిగానే బ్రిటిష్ ప్రభుత్వం ప్రవ ర్తించింది.

వర్గసంబంధాలు

అన్ని రాష్ట్రాల్లోకంటె రైతువారీ విధానం అమల్లో వున్న బొంబాయిరాష్ట్రంలో భూమిశిస్తుద్వారా ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయం వస్తూవుంది. ఆరాష్ట్రంలో, ఏయే ఉత్పత్తు లెలా వున్నాయో తెలిస్తే, మనకు కావలసిన విషయం సులభంగా తేలిపోయేది. కాని ఈ ఉత్పత్తిని గూర్చి మనకు స్పష్టంగా ఏమీ తెలియదు. మనకు లభించేదాన్నిబట్టి, రైతులమీద ఎక్కువపన్ను విధిస్తున్నారని మాత్రం చెప్పవచ్చును. జమీందారీ రైతులకంటె, రైతువారీ విధానంలోని కర్షకులకు, చట్టంప్రకారము యెక్కువ హక్కులుండవచ్చును. ఆదాయంకూడా కొంచెం ఎక్కువే వుండవచ్చును. కాని మొత్తంమీద చెప్పవలసివస్తే, రెండువిధానాల్లోని రైతులూ, దాదాపు ఒకే విధంగా ఉన్నారు. అంతే కాని రైతువారీ విధానంలోని కర్షకులు, జమీందారీ రైతులకంటె చెప్పుకోదగినంత మంచిస్థితిలో లేరు. రైతువారీ కర్షకుడు ఇరవై రూపాయలు సంపాయించి పద్ధెనిమిది ఖర్చుపెడితే, జమీందారీ రైతు నాలుగురూపాయలు సంపాయించి మూడురూపాయలు ఖర్చుపెట్టవచ్చును. దీన్నిబట్టి రైతువారీ కర్షకునిపని కొంత మెరుగే. అయితే మనం ఒకటి చూడాలి. రైతువారీ కర్షకుడికి తనకూ, తనకుటుంబ

పోషణకూ పోగా ఎంత మిగులుతూ వుంది? జమీందారీ రైతుకి ఎంత మిగులుతూవుంది? పెద్దవై సారవంతాలైన ఇతర రాష్ట్రాలలోకంటె, రైతువారీ విధానం అమల్లో వున్న బొంబాయి రాష్ట్రంలో భూమిశిస్తుమీద ఎక్కువ ఆదాయంవస్తూవుంది. అంటే, అక్కడ రైతునుంచిఎక్కువ శిస్తు వసూలు చేస్తున్నారన్నమాట. కాబట్టి రైతువారీ కర్షకుడుకూడా, పక్కా జమీందారీ పరిస్థితుల్లోవున్నట్లే తేలుతూవుంది.

ముఖ్యమైన ఉత్పత్తి సాధనాలు ఎవరి ఆధీనంలో వుంటాయో, దాన్నిబట్టి సామాజికవిధానాన్ని నిర్ణయించాలి. (1) చేసేపనిలో నూటికి 70 వాళ్ళు పొలంలో చేస్తున్నారు (2) ఫలంకూడా భూమినుంచే వస్తూ వుంది. (3) ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో అధిక భాగం భూమిశిస్తునుంచే వస్తూవుంది. వీటి నన్నిటినిబట్టి చూస్తే, ఈ దేశంలో భూమే ముఖ్యమైన ఉత్పత్తిసాధనంగా వుంది. ఇది జమీందారీవిధానానికి లక్షణం. జమీందారీవిధానం యొక్క ముఖ్యలక్షణాలన్నీ ఈ దేశంలో కనిపిస్తున్నాయి. అయితే, కాపిటలిజం అభివృద్ధి చెందటానికికూడా అవకాశాలున్నాయి. కాబట్టి మన దేశమంతా, మొత్తంమీద, జమీందారీవిధానం

లోనే వుంది. ఇలా చెప్పటంవల్ల, కాపిటలిజం కొంతవర కైనా అభివృద్ధి చెందలేదని అర్థం కాదు. దీన్నిబట్టి మన దేశంలో బూర్జువావిప్లవం రాగలదని తేలుతూవుంది.

## బూర్జువా ప్రజాస్వామిక విప్లవం

అమల్లో వుంటూవున్న సామాజిక వ్యవస్థలో తీవ్ర మైన మార్పు తేవటమే విప్లవం. జమీందారీ విధానాన్ని కూలద్రోసే విప్లవాన్ని బూర్జువా విప్లవ మంటారు. ఇప్పుడు హిందూదేశంలో ఉంది జమీందారీ విధానం. ఈ విధానాన్ని పూర్తిగా మార్చివేయాలి. ఇలాంటి చారిత్రక అవశ్యకతే రావలసిన విప్లవస్వభావాన్ని నిర్ణయిస్తుంది. మార్చవలసిన సామాజిక వ్యవస్థమీదనే విప్లవస్వభావం ఆధారపడి వుంటుంది. కాబట్టి, మన దేశంలో ఇప్పుడు రావలసినది బూర్జువా ప్రజాస్వామిక విప్లవం. దేశంలో ఇంకా వుంటూవున్న జమీందారీ ఆర్థిక విధానంలో సామ్రాజ్యవుటార్థిక విధానం ఒక భాగంగా వుంది. వలసరాజ్యపు టార్థికవిధానం, జమీందారీ ఆర్థికవిధానం మన దేశంలో చెట్టపట్టాలు కట్టుకొని నడుస్తూవున్నాయి. కాబట్టి మనదేశంలో ఈ

రెండు విధానాలు, ఒకదానికొకటి సహాయకారిగా వుంటాయి. ఇలాంటి పరిస్థితుల్లో అర్థం లేని ప్రచారక 'నినాదాలు' పనికిరావు. మార్క్సిజాన్ని గూర్చి వ్రాసిన ప్రామాణిక గ్రంథాలను అర్థం చేసుకోకుండా కార్యారంగంలోకి దిగినా ప్రయోజనం లేదు. మనదేశ పరిస్థితుల్లో వున్న ప్రత్యేకతలను శాస్త్రీయంగా అర్థం చేసుకొని విప్లవసమస్యలను అవగతం చేసుకోవాలి. అలా చెయ్యకపోతే, విప్లవాన్ని నిర్వహించటానికి వీల్లేదు. శాస్త్రీయంగా పరిస్థితుల్ని అర్థంచేసుకొని విప్లవ సమస్యలు పరిష్కరించేటప్పుడు, మార్క్సిస్టు సిద్ధాంతాలకు మనము కొన్ని నూతన విశేషాంశాలను చేర్చగలుగ వచ్చును.

ఏలక్షణాలు ఎలా వుంటే ఏవర్గ మంటారో తెలిసికొంటేనేగాని, మనదేశంలో వర్గాలను స్పష్టంగా విభజించటానికి వీల్లేదు. ఎక్కువ భూమి వుండి, దాన్ని స్వయంగా సాగుచేసుకోనివాణ్ణి భూస్వామి అంటారు. కాని, ప్రతిభూస్వామిని జమీందారుగా పరిగణించటానికి వీల్లేదు. ఉత్పత్తికి కారకముకాని భూమి వున్నవాడు, నియతంగా, జమీందారు కానక్కర్లేదు. రైతుల

కష్టంమీద జీవించేవాడు జమీందారు. అంటే, రైతు లకు మిగిలే ఫలసాయాన్ని ( సర్ప్లస్ ఉత్పత్తి ) యావత్తు అపహరిస్తాడు. అప్పుడే జమీందారు అవు తాడు. కాబట్టి స్వయంగా సాగుచేయని భూమి ఒకడికి వుండి, సాగుచేయక రైతుల కిచ్చి వారికి అందులో మిగిలే ఫలసాయాన్ని అంతా అపహరించేవాణ్ణి జమీం దారు అనవచ్చును. హిందూదేశంలో, మారుతూ వుంటూవున్న ఈ యుగంలో, వర్గభేదాలు స్పష్టంగా లేక, కలగా పులగంగా వున్నాయి. ఐనా, వర్గభేదాలను వివ క్షిస్తూ వున్నప్పుడు, కలగా పులగంగా వున్న ఈ వర్గా లను విడదీయాలి.

## బూర్జువాయిజీ

జమీందారీవర్గం తరువాతది బూర్జువావర్గం. ఈ బూర్జువాయిజీ అనేది ఫ్రెంచిశబ్దం. దీనికి పట్టణవాసి అని వ్యుత్పత్తిఅర్థం. మొదట్లో పట్టణాలను ఫ్రెంచి భాషలో బర్గ్సు అనేవాళ్లు. బర్గులోవుండే ప్రజలను బూర్జువాయిజీ అనేవాళ్లు. అంటే, పట్టణవాసులన్న మాట. అయితే ఈ బూర్జువాయిజీ శబ్దానికీ, ఆర్థికవిధా నానికీ సమన్వయ మున్నదా? మాధ్యమిక యుగాల్లో

ఈ పట్టణాలు కాపిటలిస్టు ఉత్పత్తికి కేంద్రాలుగా వుండేవి. ఇప్పుడు జమీందారీ విధానంలో వున్న హిందూదేశంలో కాపిటలిస్టు ఉత్పత్తి జరుగుతూ వున్నట్టుగానే, మాధ్యమిక యుగాల్లో, జమీందారీ విధానంలో వున్న ఐరోపా దేశాల్లో కాపిటలిస్టు ఉత్పత్తి కొన్ని కేంద్రాలలో బయలుదేరింది. ఇలా బయలుదేరిన కేంద్రాలు త్వరితంగా విజృంభించి జమీందారీ విధానాన్ని ధ్వంసంచేశాయి. అలాంటి పట్టణాల్లో ఆధునిక పరిశ్రమలు క్రమంగా వృద్ధి చెందాయి. భూమిని వదలి ఈనూతన ఆర్థిక ఉత్పత్తితో సంబంధమున్నవారే పట్టణాలకు చేరారు. అలాంటి సంబంధం లేకపోతే పట్టణాలకు ఆరోజుల్లో చేరవలసిన అవసరం లేదు. పట్టణాల్లో నాటకాలుకాని, సినిమాలుకాని, ప్రభుత్వోద్యోగాలు కాని, ఆరోజుల్లో లేవు. పట్టణాల కెక్కిన ప్రజ నూతన ఆర్థిక ఉత్పత్తితో, అంటే, పరిశ్రమలతో సంబధం వుండబట్టే చేరారు. అలా అభివృద్ధిచెందిన కేంద్రాలలో ఒక నూతన ఆర్థిక విధానం బయలుదేరింది. ఈ ఆర్థిక విధానానికి భూమి ముఖ్యంకాదు. అంటే, ఈఆర్థికఉత్పత్తి భూమిమీద ఆధారపడలేదు. నూతనఉత్పత్తి విధానంతో, అంటే, కాపిటలిజంతో సంబంధం వున్నవారిని

బూర్జువాయిజీ అన్నారు. ఈవిధంగా బూర్జువాయిజ్ అనేశబ్దం వచ్చింది.

నూతన ఉత్పత్తి విధానంతో సంబంధించిన వారు అవల్లో ఉంటున్న విధానాన్ని మార్చివేయ దలిచారు. దీనికి కారణముంది. ఏలాటి ఆటంకాలు వచ్చినా, ఈ నూతన ఉత్పత్తివిధానం అభివృద్ధిచెందింది. నానాటికీ కొత్త కొత్త వస్తువులు తయారు చేయసాగారు. ఇలా తయారైన వస్తువులన్నీ పట్టణాలలోనే అమ్ముడుపోవు; దూరప్రదేశాలలోకూడ అమ్మవలసి వచ్చింది. అందువల్ల వాటిని అమ్ముడుపోయే దూరప్రదేశాలకు చేర్చవలసి వచ్చింది. దీనిద్వారా వ్యాపారం అభివృద్ధిచెందింది. వ్యాపారమార్గాలమీద అంతటా జమీందారులు కోటలలో పొంచి కూర్చున్నారు. చుట్టుపట్ల వున్న భూమి జమీందారులది. వ్యాపారమార్గాలు ఈ దేశాలలో గూడా పోయాయి. ఈ మార్గాలపోయే వ్యాపారులను దోచుకోకపోయినా వారి సరుకులమీద పన్నులను విధించేవారు. ఈపద్ధతి కొంతమార్పు చెందినా, యింకా వుంది. పట్టణం చేరే ప్రతివస్తువుకీ, చింపిపాతకైనా, పన్ను చెల్లించవలసి వచ్చేది. ఇలాంటిది జమీందారీ విధానం. ఇలాంటి జమీందారీ విధానం సరకులు

పోకుండా కొంతవరకు అరికడుతుంది. అందువల్ల వ్యాపారానికి దెబ్బ తగులుతుంది. దీనివల్లనే వెనకటిరోజుల్లో అమ్మకానికి తయారయ్యే సరుకుల మీద ఆధారపడిన పట్టణవాసులకూ, అంటే, బూర్జువాయిజీకీ, జమీందారులకూ స్పర్థ వచ్చింది. పట్టణాలు, పరిశ్రమలు అభివృద్ధిచెందాయి. నానాటికి అమ్మవలసిన సరుకుల ఉత్పత్తి యెక్కువయింది. వీటిని ఇతర ప్రదేశాల్లో తయారయ్యే సరకులకు మార్చుకోవలసిన ఆవశ్యకత యెక్కువయింది. వ్యాపారమార్గాలలో అనేక ప్రదేశాల్లో జమీందారులు సుంకాలు విధించ మొదలెట్టారు. వ్యాపార మభివృద్ధి చెందటం వారికి ఇష్టంలేదు. అభివృద్ధి చెందటం వల్ల జమీందారీరైతులు భూమిని వదలి యెక్కువ లాభసాటిగావున్న పట్టణాలకు పోమొదలెట్టారు. రైతుల్ని భూముల్ని వదలిపెట్టి పోనిచ్చేటట్లైతే, జమీందారులు ఎవరి రక్తాన్ని పీల్చుకు తాగుతారు? అందువల్ల జమీందారులు, వ్యాపార పరిశ్రమలు శతవిధాల వృద్ధికాకుండా చూస్తారు. నూతన ఉత్పత్తి విధానం నిర్విఘ్నంగా కొనసాగించాలంటే, జమీందారులు అడ్డుపడకుండా బూర్జువాయిజీ పోరాడించవలసివుంటుంది. ఇలాంటివైరుధ్యంవల్ల జమీందారీ ఆర్థిక విధానాన్ని నాశనం చేయవలసిన

ఆవశ్యకత యేర్పడింది. సమాజం మొత్తాని కంతకూ విప్లవం అవసరమైంది. ఈఆవశ్యకత ఇతరులకంటె పట్టణ వాసులకు, అంటే, బూర్జువాయిజీకి ముఖ్యమైపోయింది. అందువల్ల ఈవిప్లవాన్ని బూర్జువావిప్లవ మన్నారు.

## పెటీ బూర్జువాయిజీ

భూమిని వదలిపెట్టి జమీందారీరైతులు నూతన ఉత్పత్తి సాధనాలతో పనిచేయటానికి పట్టణాలకు చేరుకున్నారు. ఉత్పత్తి సాధనాలు అంతకుముందే పట్టణాలలో నిలబడి పోయిన వారిపరంలో వున్నాయి. అయినా కొత్తగా పట్టణాలకు చేరుకొన్న జమీందారీ రైతులు కార్మికులు (ప్రోలిటేరియన్‌లు) కాలేదు. వీరు కూడా బూర్జువావర్గానికి చెందినవారే. ఇది నామకా వచ్చినది కాదు. సరైన అర్థంలోనే వీరు బూర్జువా వర్గానికి చెందినవా రయ్యారు. వీరికీ, బూర్జువా వర్గానికీ ఒకటే ఆదర్శం; ఒకటే భవిష్యత్తు. ఈ ఆదర్శాన్ని నిర్వహించుకోటానికి బూర్జువా విప్లవం వీరికి అవసరమైంది. దీన్ని అర్థం చేసుకుంటే తతిమ్మా విషయాలు తేలిగ్గా అర్థమవుతాయి. అపార్థం చేసుకోబడుతూ వున్న పెటీబూర్జువాయిజీని గూర్చి కూడా తేల్చుకోవటానికి

పే లవుతుంది. పట్టణాలకు వెళ్ళినవారు బూర్జువా లయ్యారు. అయితే వీరంతా భాగ్యవంతులు కారు. భాగ్యవంతు లిదివరకే పట్టణాలలో స్థావరం ఏర్పరచు కొని వున్నారు. ఈ భాగ్యవంతులే యిప్పటి కాపిటలిస్టు లకు మూలపురుషులు. కొత్తగా పట్టణాలకు చేరిన వారు పేదలు. పొలాలలో చాకిరీ చేసుకునే వారు డొక్క నిండక పట్టణాలలో పనిచేసి బ్రతకటానికి వెళ్ళారు. ఈ పేదవారినే పెటీబూర్జువాయిజీ అన్నారు. పెటీ అనే ఫ్రెంచి శబ్దానికి చిన్నది అని అర్థం. పట్టణా లలో నివసిస్తూ, కొత్తగా యేర్పడిన వర్గంలో వీరు చిన్నవారన్నమాట. అంతా పట్టణవాసులు కావడం వల్లను, అందరికీ ఉత్పత్తివిధానంతో సంబంధంవుండటం వల్లనూ, చిన్నవాళ్లని, పెద్దవాళ్లని, పేదల్ని, భాగ్య వంతుల్ని కలిపి బూర్జువా వర్గమన్నారు.

ఈ రోజున హిందూదేశంలో పరిస్థితు లిలాగే వున్నాయి. హిందూదేశంలో బూర్జువాయిజీకీ, పెటీ బూరువాయిజీకి మధ్య సంబంధా లెలా వున్నాయి ? వీరిరువురికీ వున్న భేదాలు పెద్దవైతే, వీరిని రెండు వర్గా లుగా పరిగణించాలి. వీరిద్దరి ఆదర్శాలు, లాభాలు ఒక టయితే, ఇద్దరూ కలసి బూర్జువా విప్లవం తెస్తారు. ఇది

చాల ముఖ్యమైన విషయం. అందువల్ల వర్గశక్తుల సంబంధాలను విశదంగా తేల్చుకోవడం ముఖ్యం. మనదేశంలో ఇప్పుడు జరుగుతున్నదానిని, యూరప్‌లో జమీందారీ విధానంనుంచి కాపిటలిస్టు విధానంలోకి మారిన సంధి యుగంతో పోల్చుతున్నారు. ఇది కేవలం తప్పుడు త్రోవలకు తీస్తుంది. యూరప్‌లో నూతన సంధియుగం వచ్చేసింది. అందువల్ల అక్కడ నూతనమైన వర్గవైరుధ్యం ఏర్పడింది. ఇలా యూరప్‌లో ఏర్పడిన నూతన వర్గవైరుధ్యం హిందూదేశాన్నికూడ కొంత మార్చింది. మన దేశంలోని పరిస్థితులు భిన్నంగావున్నా, వెనుకబడివున్నా, యిరోపాలోని నూతన వర్గవైరుధ్యం కొంతమార్చింది. కాపిటలిజానికి, సోషలిజానికి, బూర్జువావర్గానికి, కార్మికవర్గానికి మధ్య ఉన్న వైరుధ్యాన్ని మన దేశంలో మరవటానికి వీల్లేదు. అయినా, ఈ వైరుధ్యం మనదేశంలో, ఇప్పట్లో కాని, అద్యతన భవిష్యత్తులోకాని, జరిగే సంఘటనలకు అంతముఖ్యమైనది కాదు.

చారిత్రిక దృష్టితో చూస్తే విప్లవకరంగా వున్న నేటి కార్మికవర్గం కాపిటలిజం అభివృద్ధి చెందేటప్పుడు వున్న పెటీబూర్జువాయిజీనుంచి వచ్చింది. అందువల్ల వ్యవస్థా విషయంలో రెంటికీ సంబంధం వుంది.

ఇవి రెండూ ఒకేవర్గం యొక్క రెండు భిన్నదశలను తెల్పుతున్నాయి. ఈ అర్థంలో మన దేశంలో బూర్జువా విప్లవం రావాలంటే కార్మిక విప్లవంకూడా రావాలని అర్థం. కాని హిందూదేశంలో ఈ రోజున కార్మిక విప్లవం రావటానికి వీల్లేదు. చారిత్రికంగా బూర్జువా విప్లవం రావాలిసి వుంది. ఈ బూర్జువా విప్లవంలో కార్మికవర్గం కేవలం పెటీబూర్జువావర్గంగానే తన భూమికను నిర్వహిస్తుంది.

## జాకోబినిజం అంటే యేమిటి?

ఇప్పుడు మన దేశంలో రావలసిన విప్లవం యొక్క ఆదర్శ మేమిటని ప్రశ్న వస్తుంది. జాకోబినిజం అనే పదం చాలమంది వినేవుంటారు. ఇప్పటి ప్రోలిటేరియన్ వర్గానికి మూలపురుషులైన పెటీబూర్జువాయిజీ ప్రారంభదశలో బూర్జువాయిజీతో కలసే వున్నారు. ఆ రోజుల్లో పెటీబూర్జువాయిజీకీ, బూర్జువాయిజీకి మధ్య భేదం బ్రహ్మాండంగా లేదు. ఇరువురు ఒకే వర్గంగా వుండే వారు. కార్మిక వర్గానికి మూలపురుషులైన పెటీబూర్జు వాయిజీ అప్పటి బూర్జువాయిజీతో కలిసి బూర్జువా

విప్లవంకోసమూ, తరువాత తీసుకురావలసిన కార్మిక విప్లవంకోసమూ పోరాడారు. వీరి ఆదర్శం జాకోబినిజం. బూర్జువావర్గంలో పనిపాటలు చేసే శాఖ జమీందారీ అధికారాన్ని ధ్వంసంచేసి, రాచకీయ ప్రజాస్వామికాన్ని స్థాపించిందంటే, కార్మిక విప్లవానికి బీజాలు వేసిందన్న మాట. ఆ విప్లవానికి వైతాళిక అయిందన్నమాట. ఫ్రెంచి మహావిప్లవ సందర్భంలో పెటీబూర్జువాలు నేటి కార్మిక విప్లవానికి బీజాలు నాటారు. అదే జాకోబినిజం. కాబట్టి మార్క్సు సిద్ధాంతచ్ఛాయలను ముందుగా తెచ్చి పెట్టటంలోనే జాకోబినిజం యొక్క చారిత్రిక ప్రాముఖ్యం ఇమిడివుంది. మార్క్సిజం దేశకాలాలకు అతీతమైనది. మార్క్సు పుట్టకముందే మార్క్సిజం వుంది. కాబట్టి, ముందుగా వచ్చిన మార్క్సు సిద్ధాంతచ్ఛాయయే జాకోబినిజం, అని చెప్పవచ్చును.

బూర్జువావర్గం ఎలా యేర్పడిందో చెపుతాను. పట్టణాలలో ఒక నూతన ఆర్థిక విధానం ఏర్పడింది. కొంత మంది పట్టణవాసులకు ఉత్పత్తి సాధనాలు ఉన్నాయి. ఇతరులకు ఏవీ లేవు. కాని అంతా కలిసి ఈ ఉత్పత్తి సాధనాలతో పనిచేశారు. ఆ కాలంలో ఉత్పత్తి సాధ

నాలు ఉన్నవారుకూడా పనిచేస్తూ వుండేవారు. పని చేసేవాడు బూర్జువా అయినప్పటికీ, బూర్జువాకూడా పని చేసే వాడయ్యాడు. ఆధునిక బూర్జువావర్గ మూలపురుషులు, ఆధునిక కార్మికవర్గ మూలపురుషులు ఆరోజుల్లో పనిచేసేవారే. ఉత్పత్తి సాధనాలు తన స్వాధీనంలో ఉన్నప్పటికీ, ఆధునిక బూర్జువావర్గ మూలపురుషుడు యజమానిగా వుండేవాడు. పని నేర్పటానికి అతడు ఇంకొకణ్ణి తీసుకొనేవాడు. అలా తీసుకోబడినవాడు యజమానికోసం పనిచేయాలి. మొదటినుంచి యజమాని కొంచెంగానో గొప్పగానో అతనినుంచి దోచుకొనేవాడు.

దోపిడీ అంటే దొంగతనం కాదు. దోపిడి అనేది న్యాయసమ్మతమైన ఆర్థికవిధానం. ఆరోజుల్లో ఉత్పత్తిని పెంపొందించటానికి కావలసిన పెట్టుబడిధనం పోగు చెయ్యటానికి వేరేమార్గం లేదు. మొదట్లో ఈ దోపిడీ విధానం అట్టే కష్టం కలిగించలేదు. పని నేర్చుకోటానికి చేరినవాడూ, యజమానిగా వున్న బూర్జువా, యిద్దరూ కలసి పనిచేస్తూ ఒక యింట్లో, ఒక కుటుంబములో, పుట్టి పెరిగినట్టుగా వుండేవాడు. అందువల్ల ఇద్దరిమధ్య భేదాలు అట్టేలేవు. ఉత్పత్తి పెరుగుతూవున్న ఆరోజుల్లో పనినేర్చుకున్నవాడు కూడా ఒక యజమాని

ఆయి, తనక్రింద పనిచేసి నేర్చుకోటానికి కొంతమందిని నియమించేవాడు. క్రమంగా యజమాని పనిచెయ్యటం మానేశాడు. వ్యాపారం, జమాఖర్చు చూసుకోటం లోకి దిగాడు. కాగా, అన్ని పనులు చేయటానికి నేర్చుకునేవారిని నియమించేవాడు. ఈ విధంగా, తాను పని చేయక, తనకోసం పనిచేసేవారిని పెట్టుకున్న తరువాత, యజమాని కూలీల మధ్య భేదాలు నానాటికి యెక్కువయ్యాయి. పని నేర్చుకునేవాడు కూలివాడయ్యాడు. శాస్త్రీయంగా చూస్తే పెటీ బూర్జువాయిజీ బూర్జువా వర్గంలో ఒక శాఖగా కనిపిస్తుంది. కాని ఆర్థికంగా మాత్రం ఇద్దరిమధ్య భేదాలున్నాయి. కాపిటలిస్టు సంఘం పక్వంకాని ప్రథమ దశలో ఈ విభేదాలు తీవ్రంగా లేవు.

## బూర్జువా—కాపిటలిస్టు

ప్రస్తుతం మన దేశంలో బూర్జువా, పెటీ బూర్జువాల మధ్య వున్న భేదాలను ప్రస్తుతం వదలివేద్దాం. బూర్జువా కాపిటలిస్టు కానక్కరలేదు. ఇప్పుడు మరొక పదానికి నిర్వచనం చెప్పుకుందాం. కాపిటలిస్టు అంటే యెవరు? నా జేబులో పది రూపాయలున్నా, నా తలక్రింద

వెయ్యి రూపాయలు పాతేసివున్నా, నేను కాపిటలిస్టును కాను. ప్రపంచంలో వున్న డబ్బంతా నాదగ్గరున్నా, నేను కాపిటలిస్టును కాక పోవచ్చును. భాగ్యము కాపిటల్ కాదు. కాపిటల్ ఉత్పత్తికి సాధనం. జమీందారీ ఆర్థిక విధానంలో పొలం యెలా ఉత్పత్తికి సాధనమో, కాపిటలిస్టు ఆర్థిక విధానంలో కాపిటల్ అలాగే ఉత్పత్తికి సాధనం. రైతుకూ, అతని తన కుటుంబపోష ణకూ, పోగా మిగిలిన ఫలసాయాన్నపహరించటమనేది జమీందారీ ఆర్థిక విధానానికి లక్షణం. కాపిటలిస్టు ఆర్థిక విధానంలో ముఖ్యంగా ఉత్పత్తి చేసేవాడు స్వతంత్రుడుగా వుంటాడు. కాపిటలిస్టు ఆర్థిక విధా నంలో కృషి. చాల ముఖ్యం. కాబట్టి, జమీందారీ ఆర్థిక విధానంలో కంటె కాపిటలిస్టు ఆర్థిక విధానంలో కృషికి చాల సౌకర్యా లుంటాయి. కృషివల్ల ఉత్పత్తి జరుగుతూవున్నకొందికి కాపిటలిజం అభివృద్ధి అవుతుంది. శ్రామికవర్గం అభివృద్ధి కావటం కాపిటలిజానికి లాభదా యకం. కాబట్టి కాపిటలిస్టు ఆర్థికవిధానంలో శ్రామి కుడికి మిగిలే ఫలసాయమంతా అపహరింప బడదు. దీనికి మరొక కారణ ముంది. కాపిటలిస్టు ఆర్థికవిధా నంలో అమ్మకానికే సరకులు తయారుచేస్తారు. అందువల్ల

కాపిటలిస్టు ఆర్థికవిధానానికి వ్యాపారం ముఖ్యం. జమీందారు అమ్మటానికేమీ వుండదు. కాబట్టి రైతు కొనుక్కోటానికి డబ్బు మిగులుతుందా లేదా అన్న ప్రశ్న అతనికి రాదు. కాని కాపిటలిస్టు తయారైన సరుకుల్ని అమ్ముకోవాలి. అందువల్ల జమీందారీవిధానంలో కంటె, కాపిటలిస్టు విధానంలో ఉత్పన్నమయ్యే సంపద కొంత సరసంగా పంపకం చెయ్యబడుతుంది. అందువల్ల కాపిటలిస్టులు అమ్మే సరకుల్ని ప్రజలు కొనగలుగుతారు. అందువల్ల జమీందారీవిధానంకంటె కాపిటలిస్టువిధానం అభ్యుదయకారి. జమీందారీ దోపిడీ, కాపిటలిస్టు దోపిడీ ఒకటే ననటం చాల పొరపాటు. జమీందారీ విధానంలో మాదిరిగానే కాపిటలిజంలోకూడా వర్గవిభేదాలు అలాగే వుంటాయి. రెండు విధానాలూ కృషివల్ల వచ్చే ఫలసాయాన్ని దోచుకోటం మీదనే ఆధారపడి వుంటాయి. శాస్త్రీయంగా జమీందారీ విధానంలోకంటె కాపిటలిజంలో రెక్కల కష్టం చేసుకునే వారిపని బాగుండవలసినా, నిజానికి బాగుండక పోవచ్చును. కాపిటలిజంలో శ్రామికుడు ఎక్కువ సంపాయిస్తాడు. అందువల్ల యెక్కువ ఖర్చు పెడతాడు. శ్రామికులు ఎంత యెక్కువ ఖర్చు పెట్ట గలిగితే, కాపిటలిస్టులకు అంత లాభం;

కాపిటలిజం అంత విరళంగా అభివృద్ధి చెందు తుంది. కాబట్టి జమీందారీ విధానంలో కంటె, కాపిట లిజంలో శ్రామికుడి స్థితిగతులు బాగుండితీరాలి. దీన్ని బట్టి బూర్జువా వర్గానికే కాకుండా శ్రామికులకుకూడా బూర్జువా విప్లవంవల్ల లాభం ఉంది.

మనం ఎప్పుడూ వర్గవైరుధ్యాన్ని గూర్చి మాట్లాడు తుంటాము. వర్గసంఘర్షణ చరిత్రయే మానవచరిత్ర యని మనం నేర్చుకొన్నాం. కాని యింకో విషయం గమనించాలి. సమాజంలో, కలుపుగోలు శక్తి వొకటి వుంది. ఈ శక్తి లేకపోయి నట్లయితే, మానవసమాజం ఎప్పుడో విచ్ఛిన్నమై పోయేది. నాగరికత, పరిణామం అనేవి లేకుండ పోయేవి. సామాజిక శ్రేయస్సు అనేది వొకటి అన్ని వర్గాలను బంధిస్తుంది. కృషిఫలాన్ని దోపిడి చేస్తూనే కాపిటలిజం అభివృద్ధి చెందుతుంది. ఐనా కాపిటలిస్టు ఆర్థికవిధానం సమాజాన్నంతనూ పైకి తీసుకొస్తుంది. దోపిడీ జరుగు తున్నా, వర్గవైరుధ్యమున్నా, శ్రామికవర్గం సమా జంలో ఒక చిన్న భాగంగా వున్నంతకాలం, శ్రామిక వర్గానికీ, కాపిటలిస్టువర్గానికీ దృష్టి ఒకటే. కాపిటలిస్టు విధానం ఇరువురికీ అభివృద్ధిచెందా లని వుంటుంది.

కాపిటల్‌కీ, కృషికీ మధ్యవున్న సంబంధ బాంధవ్యాలను సరిగా అర్థం చేసుకోవటం లేదు. కాపిటల్ యెక్కడనుంచి వస్తూవుంది? కాపిటల్ అంటే యేమిటి? కాపిటల్ అంటే ధనం కాదు. ప్రోగైన సర్‌ప్లస్ కృషే కాపిటల్. జీవనోపాధికి మొదట్లో ఉత్పత్తిచేసేవాడు కొంత కృషి చెయ్యాలి. ప్రతివాడు తనకు కావలసినంత వరకే ఉత్పత్తిచేసి వూరుకున్నట్లైతే, మానవుడు ఆటవికుడుగానే వుండేవాడు. కాని సామాజిక కృషివల్ల జీవనోపాధికి ఖర్చయిపోగా మిగిలే ఫలసాయమే (సర్‌ప్లస్ ఉత్పత్తి) అభివృద్ధికి కారణం. జమీందారీ విధానంలో సర్‌ప్లస్ ఉత్పత్తి సంతా ఒక వర్గమే అపహరించి, సమాజం అభివృద్ధి కాకుండా తొక్కిపట్టి, తన అధికారాన్ని చెలాయించుకోటానికి ప్రయత్నిస్తుంది. కాని ఉత్పత్తి యెక్కువ కావటానికి మాత్రం అవకాశ మీయదు. సంపదకు హేతుభూతమైన కృషిని పొలాలందే కేంద్రీకరింప జేస్తుందే కాని, యెక్కువ ఫలసాయాన్ని యిచ్చేవాటిని చెయ్యనియ్యదు. కాపిటలిస్టు విధానంలో దీనికి సరిగా వ్యతిరేకం జరుగుతుంది. కాపిటలిజం మిగిలే ఫలసాయాన్ని

ఉత్పత్తిని యింకా పెంపొందించటానికి వినియోగిస్తుంది. ఈ విధంగా మిగిలే ఫలసాయాన్ని ఉత్పత్తికై వినియోగించటంవల్ల కాపిటల్ ఏర్పడుతుంది. అంతేకాని డబ్బు కాపిటల్ కాదు. ఒకడు ఆరుగంటలు పనిచేసి భోజనానికీ, ఇతర ఆవశ్యకతలకు సరిపోయేదాన్ని ఉత్పత్తి చేస్తాడనుకొందాం. ఒకడికి డబ్బువుంది. రెండోవాణ్ణి తనకోసం 8 గంటలు పనిచేయటానికి నియమిస్తే, ఆడబ్బు పెట్టుబడి, లేక కాపిటలంటారు. మిగతా రెండుగంటల్లో వాడు తనకు కావలసిన దానికంటె యెక్కువ ఉత్పత్తి చేస్తాడు. 8 గంటలు పని చేసినా, వానికి 6 గంటల ఫలసాయాన్నే యిస్తాడు. మిగతా 2 గంటల్లో వచ్చినదాన్ని కాపిటల్ అంటారు. కాపిటల్, కృషి అనేవాటి రెంటివల్లా కాపిటలిస్టు సమాజం ఏర్పడుతుంది. కాని కృషికిపూర్వం కాపిటల్ ఉండాలి. కాబట్టి కేవలం కృషిమీదనే కాపిటలిస్టు సమాజం ఆధారపడి వుంటుంది. కాపిటలిజం రాకముందు ఉన్న సంపదకూడా కృషివల్ల ఏర్పడ్డ సర్‌ప్లస్ ఉత్పత్తియే. ఈసంపద కృషివల్లనే కాపిటల్‌గా మారుతుంది. కాబట్టి కాపిటల్‌కి మూలం కృషి. సంపదంతా కృషే.

## వర్గసంబంధాలు

ఈ విషయాన్నే కొంత వివరిస్తాను. నాకు కొంత డబ్బు ఉంది. ఈ డబ్బుతో కొన్ని పనిముట్లు కొని కార్ఖానా పెట్టి కాపిటల్‌గా మారుస్తాను. కార్ఖానా పెట్టినంతనే నా కాపిటల్‌కి లాభం రాదు. లాభం రావటానికి పనిచేయాలి. నేనే పనిచేస్తాననుకోండి. నేనొక్కణ్ణే పని చేసేటట్లైతే నేను కొన్న పనిముట్లు కొన్ని వూరకనే వాడుకలేక మూలపడి వుండవచ్చును. వాటినికూడా వాడటానికి ఇంకొకడికి కూలిచ్చి పనిచేయిస్తాననుకోండి. ఈ రెంటివల్లా, అంటే, ఈ కొరముట్లు, నేను, కూలివాడు కలసి పనిచేయటంవల్ల, నాకూ, కూలివాడికీ కావలసిన దానికంటె యెక్కువ ఉత్పత్తి చేస్తాము. ఇరువురి జీవనోపాధికి పోగా మిగిలేఫలసాయం ఏర్పడుతుంది. పనిముట్లు నావి కావటంవల్ల మిగిలే ఫలసాయం కూడా నాదే అవుతుంది ఇలా మిగిలే ఫలసాయాన్ని నేను జేబులో వేసుకుంటే దాన్ని కాపిటల్ అంటానికి వీల్లేదు. ఇలా కొన్ని నెల్లు మిగిలేదాన్ని పోగుచేసి యింకా రెండు రంపాలో, లేక రెండు చిత్రికలో కొంటాననుకోండి. ఇలా పనిముట్లు కొనకపోతే నాదగ్గర వున్న డబ్బు కాపిటల్ కాదు. పనిముట్లు నా కాపిటల్. పనిముట్లు కొనక డబ్బును డబ్బుగానే వుంచితే, కృషి

ఫలాన్ని దోచుకోటానికి వీల్లేదు. నాదగ్గరున్న డబ్బును కృషిఫలాన్ని దోచుకోటానికి కావలసిన సాధనాల కొరకు వినియోగించితే, అప్పుడు అది కాపిటల్ అవుతుంది; నేను కాపిటలిస్టును అవుతాను. అంతేకాని డబ్బున్నంత మాత్రాన్నే నేను కాపిటలిస్టును కాను. ఉన్నడబ్బును నూతన ఉత్పత్తి సాధనాలకోసం వినియోగించినపుడే యెవడైనా కాపిటలిస్టు అవుతాడు. అలా కాక, ఆడబ్బుతో పొలం కొంటే, అతడు కాపిటలిస్టు కావాలని నియమం లేదు. అతడు భూమిని వినియోగించే విధానంమీద అతని కాపిటలిస్టుతనం ఆధారపడి వుంటుంది. భూమికూడా కాపిటలిస్టు ఉత్పత్తికి సాధనం కావచ్చును. కాని అప్పుడు అది అంత ప్రధానం కాని సాధన మౌతుంది. కాబట్టి తన ధన మంతటితోను ఒకడు భూమిని కొంటే, వాడు కాపిటలిస్టు కాడు. జమీందారీ ఉత్పత్తి విధానానికే భూమి ముఖ్యసాధనం. కాబట్టి డబ్బుతో భూమిని కొన్నంతమాత్రాననే కాపిటలిస్టు ఉత్పత్తి విధానం అభివృద్ధికాదు. అలా అభివృద్ధి కావటానికిగాను నూతన ఉత్పత్తి సాధనాలతో పని చేయటానికి కృషిని నియమించాలి. అంటే, యంత్రాలమీద, పని

చేయించాలి. అప్పుడే మిగిలే ఫలసాయం (సర్ ప్లస్ ఉత్పత్తి) కాపిటల్ అవుతుంది.

ప్రాథమిక ఉత్పత్తిసాధనం భూమి. భూమి కొంతవరకే పంట నిస్తుంది. అంతకు మించి పండదు. ఎక్కువ ఆదాయం రాదు. కాబట్టి భూమి మొంత పంట నీయ గలుగుతుందో అంతా పండిస్తున్నారు. ఇంకా మెక్కువ పండించటానికి వీల్లేదు. నేడు హిందూదేశంలో బయలు దేరుతున్న ఆర్థిక సమస్య లన్నిటికీ యిదే ముఖ్యకారణం. హిందూ దేశంలోని దారిద్ర్యానికి కారణం ఒకటే వుంది. దేశంలో ఉన్న ఆర్థికవిధానం వల్ల ఇంకా మెక్కువ పండించ టానికి వీల్లేదు. అయినా, యీ పనికిరాని ఆర్థికవిధానం అలాగే యింకా నిలిచివుంది. పొలాలద్వారా మొంత వరకు పండించటానికి వీలుందో, అంతా పండిస్తు న్నారు. ఈ ఫలసాయం చాలటంలేదు. అయినా యింకా యిలాంటి పొలం మీదనే ఆధారపడి వుండ వలసి వచ్చింది. కాబట్టి ఈ దారిద్ర్యంనుంచి తప్పించు కోవాలంటే నూతన ఉత్పత్తి సాధనాలమీద ఆధార పడాలి. అలా జరగాలంటే కొన్ని పరిస్థితు లుండాలి. కాని ఈ పరిస్థితుల్ని సృష్టించుకోటానికి దేశంలోని పనికిరాని ఆర్థికవిధానం అడ్డువస్తూవుంది. అందువల్ల

విషమస్థితి యేర్పడుతూవుంది. ఇలాంటి విషమస్థితినుంచి బయటపడటానికి విప్లవ మొకటే శరణ్యం. సామాజిక పరిణామం ఏఆటంకం లేకుండా, అవిచ్ఛిన్నంగా సాగుతున్నంతకాలం విప్లవంతో నిమిత్తం లేదు. కాని విషమ స్థితి యేర్పడి నప్పుడు, అన్నీ గుడుగుడు గుంచంగా, నాలుగు స్తంభాల ఆట ఆడుతూ వున్నప్పుడు, వాటిని భేదించ వలసివుంటుంది. ఇలాంటి విషమ పరిస్థితిని భేదించటమే విప్లవం.

ఇంతవరకు కాపిటలిజ మంటే యేమిటో చెప్పుకున్నాం. అసలు మొదట బూర్జ్వాయిజీ యెలా యేర్పడిందో, పెటీబూర్జ్వాయిజీ ప్రాముఖ్య మేమిటో, తెలుసుకున్నాము. పట్టణవాసుల్లో చిన్న తరగతివారంతా కలసి పెటీబూర్జువా వర్గంగా ఏర్పడింది. అందువల్ల ప్రారంభదశలో ఒకవిధంగా చూస్తే, సంపూర్ణమైన వర్గం కాక, మరోవిధంగా చూస్తే వర్గానికంటే పెద్దదిగా వుంది. మొదటి దశలో అది బూర్జువా వర్గంలో ఒకభాగం. పైగా కాపిటలిజంయొక్క ప్రాథమికదశలో ఈ పెటీబూర్జువా వర్గంలో శ్రామిక వర్గం కూడా కలిసివుంది. కాపిటలిజం అభివృద్ధి అవుతూ

వున్నప్పుడు తనకు సహాయకరంగా ఉండేవారినికూడా సృష్టిస్తుంది. ఈసహాయక వర్గంలో మతగురువులు, ప్రచారకులు, డబ్బుతీసుకుని పోరాడే సైనికులూ ఉంటారు. బూర్జువావర్గానికి సహాయపడే పరివారం ఇంకోవిధంగా వుంటుంది. వ్యాపారం అవిచ్ఛిన్నంగా సాగటానికి పరిపాలక యంత్రం ఉండాలి. పట్టణవాసం చేస్తున్న ప్రజల్లో కొంతమంది పరిపాలనా శాఖలో దూరుతారు. వీరుకూడా నూతన బూర్జువా వర్గంలోని వారే. అయితే ఈ విషయాన్ని విభజించి తెలుసుకోటానికి ఒకమార్గముంది. బూర్జువా వర్గంలో ధనికులైనవారు క్రమేణ కాపిటలిస్టులయి ఉత్పత్తి విధానంతో సన్నిహిత సంబంధము లేకుండా వుంటారు. కొంతమంది ఉత్పత్తిలో నిమగ్నులై వుంటారు. వీళ్ళంతా క్రమంగా ఒక వర్గమౌతారు. ఇదే కార్మికవర్గం. కాని మొదట్లో ఈ కార్మికులు కూడా బూర్జువావర్గానికి సహాయకారులే. వీరిని కూడా పెటీబూర్జువా వర్గంక్రింద పరిగణించాలి. కాపిటలిస్టు పరిశ్రమలు అభివృద్ధిజెంది, వ్యాపారం పెంపొంది, మూడోరకపు పరివారాన్ని సృష్టిస్తుంది. దీనిలో చిన్న వర్తకులుంటారు. ఈపరివారం గ్రామాలలోని చిల్లర వర్తకునిదాకా వ్యాపించి వుంటుంది. ఈ చిల్లర వర్త

కుడు భాగ్యవంతుడు కాడు. ఇతడు దోచుకునేదికూడా వుండదు. అయినా కాపిటలిజం అనే గచ్చపొదలో ఇతడుకూడా ఒకచిన్న తీగవంటివాడు. కాపిటలిస్టు అనే పదాన్ని నిర్వచిస్తే, ఈ చిల్లర వర్తకుడు కాపిటలిస్టు కాడు. అయినా, అతడు కూడా ఒక బూర్జువాయే.

## రైతులు

పెటీబూర్జువా వర్గంలో నాల్గో శాఖ ఒకటి వుంది. రైతు ఈశాఖకు చెందినవాడే. జమీందారీ సమాజంలో ఉన్నంత కాలం రైతు జమీందారీ విధానంలో ఒక భాగంగా వుంటాడు. కాపిటలిజంలో కూడా ఆహార పదార్థాలు, వీటితోపాటు పరిశ్రమలకు కావలసిన ముడి సరకులు, పండించవలసి వుంటుంది. కాబట్టి కాపిటలిస్టు విధానంలో కూడా, రైతు సమాజంలో ఒక ముఖ్య భాగంగా వుంటాడు. అయితే జమీందారీ విధానపు శాఖలోనుంచి కాపిటలిస్టు ఆర్థికవిధానపు శాఖలోకి వస్తాడు. అందువల్ల రైతు బూర్జువా వర్గశాఖలో చేరుతాడు. పట్టణం పెరుగుతుంది. పెరిగి బహిఃప్రపంచంలోకి, అంటే, గ్రామాల్లోకూడా కాపిటలిస్టు ఆర్థిక విధానం వ్యాపిస్తుంది. రైతు కొయ్యనాగలితో సాగు

చేస్తున్నా కాపిటలిస్టు ఆర్థికసూత్రాలకు లోబడే పండిం చాలి. అందువల్ల కాపిటలిస్టు విధానంలో రైతు ఒక భాగంగా ఉంటాడు.

మన దేశం ఇప్పుడు సంధి యుగంలో వుంది. అందు వల్ల రైతుని కేవలం ఒక శాఖకు చెందిన వాణ్ణిగా పరిగణించటానికి వీల్లేదు. ఒకవిధంగా చూస్తే చిన్న జమీందారు, మరొకవిధంగా చూస్తే పెటీబూర్జువా. చట్టరీత్యా యిప్పుడున్న సామాజిక నిర్మాణంలో రైతు జమీందారీ విధానంలో వుంటున్నాడు. ఉత్పత్తినిబట్టి విచారిస్తే, కొంతవరకు కాపిటలిస్టు సమాజంలో సభ్యుడుగా ఉన్నాడు. అతని జీవికలో కొంతభాగం జమీందారీ ఆర్థిక సూత్రాలకు లోబడి, కొంత కాపిట లిస్టు ఆర్థిక సూత్రాలకు లోబడి నడుస్తూ వుంది. కాబట్టి రైతులనందరిని ఒక వర్గంగానే పరిగణించటానికి వీల్లేదు. సాధారణంగా రైతులంతా ఒకేవర్గానికి చెంది నట్లు చూట్టం పరిపాటై పోయింది. కొంతమంది రైతుల్ని శ్రామికవర్గంలో చేరుస్తారు. అతివాదులైన మార్క్సిస్టులు కొందరు, రైతులు పెటీబూర్జువా యిజీ అనీ, అందువల్ల విప్లవ నిరోధకులనీ, అంటారు.

సామాజికంగా నిజానికి, రైతులు పెటీబూర్జువా వర్గానికి చెందినవాళ్లే. పెటీబూర్జువాయిజీ గ్రామాల్లోనూ వుంటుంది, పట్టణాల్లోను వుంటుంది. కాపిటలిస్టు ఆర్థిక విధానంలో రైతులు పెటీబూర్జువాయిజీ అవుతారు. కాని హిందూదేశంలో రైతులు ఇంకా జమీందారీ విధానంలోనే ఉన్నారు. అందువల్ల రైతులు పెటీబూర్జువా వర్గానికి చెందినవారు కారు. అందువల్ల రైతులు బూర్జువా విప్లవకారకులే అవుతారు. రైతులు పెటీబూర్జువాలయినప్పుడు కార్మిక విప్లవానికి దోహదమిస్తారు.

పెటీబూర్జువాయిజీలో మరొక భాగంగా వున్న పేదలైన పట్టణవాసులు, ఈలోగా ఒక వర్గంగా తయారవుతారు. కాపిటలిస్టు ఆర్థికవిధానం పెటీబూర్జువాయిజీకీ, ఈ నూతన వర్గానికీ లాభసాటిగా లేనప్పుడు పేదలైన పట్టణవాసులు రైతులతో సంబంధాలు ఏర్పరుచుకుంటారు. కాపిటలిజం అభివృద్ధి అవుతూ వున్నప్పుడు పెటీబూర్జువా శాఖగా వుండే రైతులు కూడా దోచుకోబడుతారు. కాపిటలిజం ఇద్దరినీ దోచుకుంటుంది. ఇటు రైతుల్ని, అటు శ్రామికుల్ని దోచుకుంటుంది.

మనదేశంలోని రైతులు రెండు విధుల్ని నిర్వర్తించవలసి వుంటుంది. బూర్జువా విప్లవంలోను, యిప్పటి కార్మిక విప్లవ యుగం లోను, వీరు విప్లవకరంగా పని చేస్తారు. అందువల్ల మనదేశ పరిస్థితుల్లో అందరికంటె రైతులే ఎక్కువ విప్లవ కారులని గ్రహించాలి. రైతులు లేకుండా అటు బూర్జువా విప్లవం కాని, యిటు కార్మిక విప్లవం కాని నెగ్గలేదు.

మనం ఒకణ్ణి తిట్టాలంటే బూర్జువా అంటాము. కాని దీనికంటెకూడా పెటీబూర్జువా అనేది పెద్ద తిట్టు. ఎందు కని? బూర్జువా పరివార కోటిలోనివాడు పెటీబూర్జువా. అంటే, కొంచెం ఎక్కువ తక్కువగా గులాం, లేక సేవ కుడు అన్నమాట. ఇంతకుముందు నాలుగు రకాల పెటీబూర్జువా లని చెప్పుకున్నాం. ఆవిభజన, కాలాన్ని లెక్కలో తీసికోకుండా, సమాజాన్ని పరిశీలిస్తే తేలింది. మళ్ళీ కాలాన్ని లెక్కలోకి తీసికొని, అంటే, చారిత్ర కంగా విభజించి చూద్దాము. మొదట్లో పెటీబూర్జు వానుంచే యిప్పటి బూర్జువాయిజీ వచ్చింది. అంటే చిన్నచిన్న పనివాళ్ళనుండీ, యజమానులనుండీ బూర్జు వావర్గం ఏర్పడింది. ఈ పెటీబూర్జువాలకంటె మరొక

రకపు బూర్జువా లున్నారు. వీరు కాపిటలిజంవల్ల ఏర్ప డ్డారు. కాపిటలిజం అభివృద్ధి చెందే కాలంలో అల్ప మేధావులూ, ఉద్యోగస్థులూ, చిన్నచిన్న వర్తకులూ, దుకాణదారులూ కలిసి బహుసంఖ్యాకమైన ఒకవర్గంగా ఏర్పడుతారు. కాపిటలిజం కుళ్ళేకాలంలో మొదటి దెబ్బ ఈ వర్గానికి తగులుతుంది. కాపిటలిజం అభివృద్ధి చెందుతున్నంతకాలం ఈ వర్గంవారందరికి ఉద్యోగాలు దొరుకుతాయి. వ్యాపారం అభివృద్ధి అవుతున్నంత కాలం దుకాణపుదారులు లాభాలు పొందుతూ ఉంటారు. వారి సంబంధులకు కూడా జీవితాలు సాగు తూనే ఉంటాయి. ఆర్థిక విషమస్థితి రావడంతోనే అల్ప మేధావులకు గిట్టుబడికాదు. ఉద్యోగస్థులకు ఉద్యో గాలు ఊడుతాయి. వ్యాపారం సన్నగిల్లటంవల్ల దుకా ణపుదార్లు కొట్లు కట్టివేయవలసి వస్తుంది. కాబట్టి ఆర్థి కంగా పెద్దబూర్జువాయిజీకీ, యీరెండోరకపు పెటీబూ ర్జువాయిజీకి వైరుధ్యం ఉండాలి. కాని యీ రెండువర్గా లను కలిపే సూత్రం ఒకటి వుంది. అధికార గౌరవాలే యీసూత్రం. ఈ రెండువర్గాలూ పెద్దమనుష్యులుగా, గౌరవనీయులుగా పెరిగారు. రాజకీయంగా, యీ పెటీ బూర్జువాయిజీని కార్మికులనుగా చేసినప్పటికీ నమ్మ

లేదు. కాని తమ్మును కాపాడుకోవడానికి ఈవర్గం కార్మి కులతోనూ, రైతులతోనూ, చేరకతప్పదు. కాని చేరదు. గుమాస్తా ఉన్నాడు అంటే, ఆజన్మం నిష్ఫలంగా ఉద్యో గంకోసం దేవుళ్ళాడుతాడు. అతనికి కాపిటలిజంనుంచి వచ్చే దేమీ ఉండదు. అయినా కాపిటలిజానికి వ్యతిరే కంగా మాట్లాడితే, ఉన్న ఉద్యోగాశాంకురాలు కూడా సమూలంగా నాశనమై పోతాయని భయపడతాడు. ఈ ఆశే అతణ్ణి ఉద్యోగాన్నుంచి ఊడబెరికిన విధానానికే ప్రేళ్ళాడదీస్తుంది.

కాని క్రమంగా, ఈ పెటీబూర్జువా శాఖలోని సభ్యులు తమ దుస్థితిని గుర్తించి చైతన్య పూరితులై విప్లవకారు లౌతారు. ఈ సందర్భంలో పెటీబూర్జువా యిజీకీ, కార్మికులకూ ఉండే సంబంధాలనూ, పెటీ బూర్జువాయిజీ ఎలా కార్మిక నాయకత్వంక్రిందకి వచ్చేదీ చెప్పవలసి ఉంది. అయితే యీవిషయాలను ముందు మరో సందర్భంలో చెపుతాను. ప్రస్తుతం పట్నవాసం చేసే పెటీబూర్జువాయిజీ, యిప్పుడు మన దేశంలో రావలసిన విప్లవానికి నాయకులై నడుపుతా రని ఎందుకంటున్నాం?

కాపిటలిస్టు ఆర్థిక విధానంలో ఒక భాగంగా ఉంటం వల్ల పెటీబూర్జువాయిజీ లాభించింది. ఈ వర్గంవారికి కొంత చదువు లభించింది. అందువల్ల విప్లవ ఆవశ్యకతను ఒకసారి గ్రహించారంటే, శ్రామికులకంటె వీరు ఎక్కువగా విప్లవానికి దోహదమిస్తారు. మన దేశంలో శ్రామికులు ఇంకా విద్యాదికం లేక, చాల వెనకబడి ఉన్నారు. అందువల్ల సమాజాన్ని పూర్తిగా మార్చి, మళ్లీ నిర్మించుకోడానికి తోడ్పడలేరు. కేవలం క్షుద్రదేకంతోనూ, ఇప్పటికంటె కొంత బాగుపడాలన్న ఉద్దేశంతోనూ, పాటుపడతారుగాని సామాజిక సమస్యల్ని అర్థంచేసుకుని పరిష్కరించడానికి తోడ్పడలేరు. మొదటి దశలోనైనా, నాయకత్వం మధ్యతరగతి తీసుకుంటుంది కాని శ్రామికులకు రాదు. పట్టణవాసులైన పెటీబూర్జువాలు ఈ నాయకత్వం వహిస్తారు. శ్రామికులు ఎంత పెటీబూర్జువాలుగా ఉన్నారో, పట్టణవాసంచేసే పెటీబూర్జువాలుగూడా అంత శ్రామికులుగా ఉన్నారు.

సాధారణ పరిస్థితుల్లో కాపిటలిజం అభివృద్ధి చెందుతూ ఉన్నప్పుడు శ్రామికవర్గం కొంత లాభిస్తుంది. జీవనోపాధి పరిమాణం పెరగడంవల్ల కొంత

తెలివి తేటలు పెరుగుతాయి. వీరిలో బాగా ముందుకు వచ్చినవారు విప్లవ ఆవశ్యకతను గుర్తిస్తారు; విప్లవ చైతన్యం కలుగుతుంది. హిందూదేశంలో కాపిటలిస్టు దోపిడీకి పాల్పడి వీరు పైకి రాలేకుండా ఉన్నారు. అందు వల్ల విప్లవ ఆవశ్యకతను, గుర్తించలేరు. అయితే వీరిలో ఇంకో శాఖవారు ఉన్నారు. పాలక యంత్రాన్ని నడిపించుకోవడానికి కాపిటలిజం కొందరిని నియమిస్తుంది. వీరినిగూడా కాపిటలిజం దోచుకుం టుంది. అయితే పాలకయంత్రంలో పని చేయడానికి వీరికి కొంత చదువు చెప్పించవలసి ఉంటుంది. ఈవిద్యవల్ల వీరు కాపిటలిజాన్ని ఎదుర్కొంటారు. జ్ఞానం అంత శక్తిమంతం. మనమంతా ఇలాంటి పెటీబూర్జువా వర్గా నికి చెందినవాళ్లమే. హిందూదేశంలో కాపిటలిజాన్ని ఎదుర్కోటానికి తయారు కాలేదంటే, దానికి మనపిరికి తనమే కారణం. ఆపని పూని చెయ్యక కార్మిక అవ తార పురుషుడికోసం నోరు తెరుచుకుని కూర్చోవడం వల్ల ప్రయోజనం లేదు. పెటీబూర్జువాయిజ్ కార్మిక నియంతృత్వంకోసం ఉవ్విళ్లూరుతూవుందంటే పచ్చి పిరికి తనం చాటుతూవుందన్నమాట.

## శ్రామికులు—కార్మికులు

శ్రామికులు, కార్మికులు అనే పదాలను అర్థం చేసుకోవడానికి చాల తికమకలు పడుతున్నారు. ప్రతిదేశంలోనూ, ప్రతియుగంలోను శ్రామికులున్నారు. కార్మికులు కాపిటలిస్టు ఉత్పత్తి విధానంలో ఉంటారు. ప్రతి కార్మికుడూ శ్రామికుడే. ప్రతిశ్రామికుడూ కార్మికుడు కాడు. కార్మికుడి ముఖ్యలక్షణం ఏమిటి? కాపిటల్ (డబ్బు మాత్రంకాదు) ఉత్పత్తిసాధనంగా ఉన్న ఆర్థిక విధానంలో పనిచేస్తాడు. ఇక్కడ పారిభాషిక విషయాలలోకి దిగదల్చుకోలేదు. అయినా శ్రామిక కార్మిక విభేదం మాత్రం స్పష్టంగా గ్రహించాలి. కాపిటలిష్టు ఆర్థిక విధానంలో భూమికూడా కాపిటలిస్టు ఉత్పత్తికి సాధనంగా ఉంటుంది. భూమిశిస్తు కాపిటలిస్టు విధానంలో గూడ ఉంటుంది. అయితే యీశిస్తు యొక్క సామాజికస్వభావం మారుతుంది. జమీందారీ విధానంలోని భూమిశిస్తు, కాపిటలిస్టు విధానంలోని భూమిశిస్తు ఒకటికాదు. కాబట్టి కొన్నిపరిస్థితుల్లో వ్యవసాయపుకూలీలు కార్మికవర్గంలో చేరుతారు.

కార్మికులకు మరో లక్షణం వుంది. సొంత ఆస్తి లేక పోవడమే కాదు, అలాంటి సొంత ఆస్తిని తిరిగి సంపాదించుకునే అవకాశాలు గూడా ఉండకూడదు. ఒకడి సొంత ఆస్తి అపహరింప బడవచ్చును. అయితే వాడు తిరిగి సొంత ఆస్తిని సంపాదించుకోడానికి వీలులేకుండా ఉండాలి. అప్పుడే అతడు కార్మికుడు అవుతాడు. మళ్లీ సొంత ఆస్తిని సంపాయించుకోవడానికి అవకాశ మున్నంత కాలం అతడు కార్మికుడు కాడు. కాబట్టి పొలంలేని రైతు కార్మికుడు కావాలనే నియమం లేదు. అతని భూమి పోవచ్చును. అతడు ఎక్కడికో వెళ్లి ఏనాల్గు వందలో, అయిదు వందలో, వెనక వేసుకొని మళ్లీ ఏకుంటో, రెండుకుంటలో, భూమి కొనుక్కోవచ్చును. తిరిగి సొంతసేద్యం పెట్టుకోవచ్చును. కాబట్టి తిరిగి సొంత ఆస్తిని సంపాయించుకోడానికి అవకాశాలు పూర్తిగా నశించినప్పుడే పొలంలేని రైతు కార్మిక వర్గంలో చేరుతాడు. అలాంటిది, భూస్వామ్య విధానం పూర్తిగామారి, వ్యవసాయంగూడా పెద్దమొత్తంమీద జరిగే పరిశ్రమగా తయారైతే, పొలంలో చిన్న పేలిక సంపాయించినా, దానిలో చేసే వ్యవసాయం పూర్తిగా

గిట్టుబాటు కాని పరిస్థితుల్లోనే జరుగుతుంది. తిరిగి పొలం సంపాయించుకోవాలనే కోరిక కూడా పొలంలేని రైతులో నశించినప్పుడే అతడు కార్మికుడవుతాడు.

తిరిగి సొంత ఆస్తి సంపాదించుకునే అవకాశాలు లేకపోవడం అనే లక్షణం కార్మికులకు లేక పోతే, వారు సోషలిజం కావాలంటారని చెప్పడానికి వీలులేదు. వ్యక్తిగతంగా ఉత్పత్తి సాధనాలు సంపాయించడానికి తనకు వీలులేనప్పుడే, ఒకవర్గం ఉత్పత్తి సాధనాలు సమాజపరంగా ఉండాలంటుంది. కాబట్టి శ్రామికుడు ఒకచిన్న ఫాక్టరీలో పనిచేస్తున్నంత కాలం పెటీబూర్జువాగా ఉంటాడేకాని, కార్మికుడు కాజాలడు. అతనికి అతని రెక్కలకష్టం తప్ప తన దనుకోడానికి ఒక పూచిక పుల్లగూడా లేక పోవచ్చును. అంత మాత్రాన అతడు కార్మికుడు కాడు. బాగా అభివృద్ధి చెందిన కాపిటలిస్టు సమాజంలోనే, కృషిగూడా ఒక సరుకుగా తయారై, కూలి డబ్బులకు మారకం జరుగుతుంది. కాపిటలిస్టు ఆర్థికవిధాన ప్రాథమిక దశలో ఈకృషి కాపిటల్‌కు మూలం అవుతుంది. ఇప్పటి బూర్జువాయిజీ యొక్క పూర్వులంతా చాలవరకు శ్రామికులే. ఒక చిన్న

పారిశ్రామికసంస్థలో పనిచేసే శ్రామికుడు, తానుకూడా ఒకానొక రోజుకి చిన్నదుకాణం పెట్టుకో గలుగుతా ననుకుంటాడు. శ్రామికుడు పెద్ద మొత్తంమీద ఉత్పత్తి జరిగే సంస్థలో కుదిరి, అలా బ్రహ్మాండంగా ఉత్పత్తి చేసే సాధనాలను తానుగానీ, ఇంకా ఏవొకడైనా గానీ సొంతం చేసుకోవడానికి వీలులేదని గ్రహించినప్పుడూ, ఆ ఉత్పత్తి సాధనాలను చిన్న చిన్న పంపిళ్లుగా చేసికొని, వ్యక్తికంగా తీసుకోవడానికి వీలులేదని గ్రహించి నప్పుడే, కార్మికుడు అవుతాడు. ఇంకా శాస్త్రీయంగా నిర్వచించాలంటే, కార్మికుడు శ్రామికవర్గం వాడై ఉండాలి. ఈ శ్రామిక వర్గం సమష్టి కృషికోరే ఉత్పత్తి సాధనాలతో సమష్టికంగా పని చేయాలి. సమష్టి కృషి ఉన్నప్పుడే ఉత్పత్తి సాధనాలు, పెట్టుబడితో సహా, సమాజపరం చేయబడుతాయి. ఈ లక్షణాలను శ్రామిక వర్గానికి అన్వయించి మనం నిరుత్సాహపడనవసరంలేదు. ఈ నిర్వచనం ప్రకారం దేశంలో ఇరవై లక్షలకన్నా ఎక్కువ కార్మికులు లేరు. ఈ ఇరవై లక్షల మందిని కూడా కార్మికులంటున్నామంటే, ఒకటే కారణంఉంది. వీరు పెద్ద పెద్ద కర్మాగారాల్లో సమష్టిగా పని చేస్తు

న్నారు. అంతేగాని వీరికి గ్రామాలతో సంబంధం పోలేదు. తాము సంపాదించేదాన్ని గ్రామాల్లో ఉన్న తమబంధువుల పోషణకు పంపించడం ఉంది. ఒకవేళ యీబంధంగూడా లేదన్నప్పటికీ, నాలుగు డబ్బులు వెనక వేసుకుని మళ్లీ పారిశ్రామిక ఉత్పత్తి సాధనాలూ, పొలం పొట్రా సంపాయించాలనే ఉద్దేశం ఉంటుంది. ఇంకా మళ్లీ రైతులం అవుతామన్న ఆశ పూర్తిగా నశించలేదు. దీన్నిబట్టి చూస్తే, సరియైన కార్మికులు రెండు లక్షలకన్నా ఎక్కువ ఉండరు. సరియైన శాస్త్రీయ దృక్పథంతో చూస్తే, నేటి హిందూదేశంలో కార్మికులసంఖ్య స్వల్పమని, దాదాపు లెక్కలోకి వచ్చేది కాదనీ, తేలుతుంది. దీనికి ప్రచారకులు ఒప్పుకోకపోవచ్చును. అయినా యిదిసత్యం, నేటిహిందూదేశ సమాజాన్ని పరిశీలించి శాస్త్రం చెప్పుతూవుంది. అయితే ప్రపంచంలో ఎంత అముఖ్యమైన దాన్నైనా త్రోసి వేయడానికి వీలులేదు, అనే పక్షంలోనే యీసిద్ధాంతానికి ఆక్షేపణ రావచ్చును. నిజమే. ఉన్నదాన్ని అల్పమైనా విస్మరించగూడదు. అయితే నేటి హిందూదేశంలోని ఇతర వర్గాలతో కార్మికుల బలాన్ని పోల్చి

చెపుతూ ఉన్నప్పుడు ఈ విషయాన్ని తప్పకుండా నిరసించవలసిన అవసరం లేదు.

ఇంత వరకు చర్చించి తెల్సుకున్న శాస్త్రీయ విషయాలను మన సమాజానికి అన్వయిస్తే, మన సమస్య తేలిపోతుంది. పారిభాషిక పదాలకు స్పష్టమైన నిర్వచనాలను చెప్పుకున్నాం. ఇప్పటి మన సమాజాన్ని పరిశీలించిన తర్వాత, ఈ సమాజంలో ఉన్న వర్గాల పరస్పర సంబంధాలు ఎలా ఉన్నాయో తేల్చుకోవడం తేలిక. మొట్ట మొదట కన్పించే విషయం: మన సమాజాన్ని విభజించి, ఇది ఫలానివర్గం, ఇది ఫలానివర్గం, అని తేల్చి చెప్పడం కష్టం. ఈ వర్గవిభేదాలు స్పష్టంగా లేవు. ఇవి ఒకదానితో ఒకటి కొంత కలుస్తున్నాయి. ప్రతి భారతీయుడూ కనీసం రెండురకాల సామాజిక విధానాలకు సంబంధించి ఉంటున్నాడు; పరస్పర విరుద్ధంగా వున్న రెండురకాల ఆర్థిక విధనాల్లో తగుల్కొన్నాడు. ఇది అభివృద్ధి అరికట్టబడిన సమాజానికి ఒక ముఖ్య లక్షణం. సామ్రాజ్యప్రభుత్వ ఫలితంగా ఇది ప్రాప్తించింది. ఇదే సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమానికి మూల బీజం. దీనివల్లనే సామ్రాజ్య ప్రభుత్వానికి వ్యతిరేకంగా

సంయుక్తపు పోరాటాన్ని సాగించవలసిన ఆవశ్యకత ఏర్పడుతూ ఉంది. పరస్పర వైరుధ్యం ఉన్న వర్గాలే దేశంలో ఏర్పడి వుంటే, సంయుక్తపు పోరాటాన్ని సాగించడానికి వీలు ఉండేదికాదు. ఏవర్గానికి ఆవర్గాన్ని, ప్రత్యేక ప్రాముఖ్యాన్ని ఇచ్చి వ్యవస్థాపిస్తూ, సంయుక్త పోరాటాన్ని సాగించాలనడంలో అర్థం లేదు. అందరూ బానిసతనంలో ఉంటంవల్ల అంతా కలసి పోరాడవలసిన ఆవశ్యకత ఏర్పడుతూఉంది. ఇక్కడ కొంచెంభేదం వుంది. అయితే ప్రజాసామాన్యం చాలవరకు ఒకేరకపు దోపిడీకి గురి అయింది. వీరందరికీ, సామ్రాజ్యప్రభుత్వం పోవాలి.

ఈ దృక్పథంతో మన సమాజంలోని వివిధశాఖల వారి దృష్టులు ఎలా వున్నాయో చూడాలి. జమీందారీ వర్గానికి సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమమందు ఎలాంటి సానుభూతీ ఉండదు. ఆర్థికలాభాలు జమీందారీ వర్గానికీ, సామ్రాజ్య ప్రభుత్వానికీ ఒకటే. జమీందారీ ఆర్థిక విధానం, వలసరాజ్యాల ఆర్థికవిధానం తిలతండులన్యాయంగా, ఎలాంటి వైరుధ్యం లేకుండా, కలిసి మెలసి పోతాయి. కాబట్టి జమీందారీ వర్గం అంతా శత్రుకోటిలోనిదే. అయితే చాలామంది జమీందార్లు

కాపిటలిస్టులుగా ఉంటంవల్ల బూర్జువా వర్గానికి చెందు తారు. అందువల్ల వర్గరీత్యా సామ్రాజ్య ప్రభుత్వా నికి వ్యతిరేకులుగా ఉండాలి. జమీందార్లు కాపిటలిస్టు లుగా ఉంటే, సిద్ధాంతరీత్యా సంయుక్తపు పోరాటంలో సంస్థానాధిపతులను కూడా చేర్చుకోవలసి ఉంటుంది. అంటే, కాశ్మీర సంస్థానాధిపతి దగ్గరనుంచి బొంబాయి గుడ్డలమిల్లులో పనిచేసే శ్రామికుడి దాకా కలుపుకో వలసి ఉంటుంది. దీన్నిబట్టి జాతీయ సంయుక్తపు పోరాటం అనే సిద్ధాంతంలోని రసాభాస కన్నులకు పొడగట్టుతూనే ఉంది.

ఇక హిందూదేశపు కాపిటలిస్టులకూ, సామ్రాజ్య ప్రభుత్వానికీ, ఉన్న సంబంధ బాంధవ్యాలను పరిశీ లిద్దాము. పరిశీలించేటప్పుడు వెనుక తేల్చుకున్న విష యాలను మరచి పోకూడదు. కాపిటలిస్టు లంటేనే ఒక చిన్నవర్గం. ఈ కాపిటలిస్టు ఆర్థిక విధానంలో పనిచేసే వాళ్లంతా యీ వర్గంలోకి రారు. ఏది ఎట్లున్నా, హిందూదేశంలో కాపిటలిస్టు వర్గం చాలా స్వల్పంగా వుంది. మన దేశంలో కాపిటలిజం ఎలా అభివృద్ధి చెందిందో చూస్తే, కాపిటలిజం జమీందారీ ఆర్థిక

విధానంతో తెగతెంపులు చేసుకుని, విడవడ లేదని తేలుతుంది నిజానికి హిందూదేశపు కాపిటలిజం జమీందారీ వర్గ సంబంధాలమీదనే అభివృద్ధి చెందింది. కాబట్టి అంతవరకూ హిందూదేశపు కాపిటలిస్టు ఆర్థిక విధానం వలసరాజ్యపు టార్థిక విధానంలో ఒకభాగమే అవుతుంది. జమీందారీ, వలసరాజ్య, కాపిటలిస్టు దోపిడీలు, హిందూదేశంలో సామ్రాజ్య ప్రభుత్వం అవలంబించే ఆర్థిక విధానంలో భాగాలుగా ఉన్నాయి. కాబట్టి హిందూదేశంలోని కాపిటలిస్టు వర్గం కూడా శత్రుకోటిలోనిదే.

## డీ కా ల నై జే ష న్

చాలవరకు జమీందారీ ఆర్థిక విధానాన్ని పురస్కరించుకొని హిందూదేశంలో సామ్రాజ్య ప్రభుత్వం నిరంకుశంగా దోపిడీ సాగించగలిగింది. ఇంతకు ముందు చర్చించని విషయ మొకటి యిక్కడ చూడవలసి వుంది. ప్రాపంచిక ఆర్థిక విధానాన్నుంచి హిందూ దేశపు ఆర్థిక విధానాన్ని వేరుచేసి చూడటానికి వీలులేదు. ప్రాపంచిక ఆర్థిక విధానంలో హిందూదేశపు ఆర్థిక

విధానం ఒకభాగమై పోయింది. కాపిటలిజానికి విషమ స్థితి వచ్చిందంటే, సామ్రాజ్య విధానానికి విషమస్థితి వచ్చిందన్నమాట. ఇలాంటి విషమస్థితినుంచి బయట పడటానికి సామ్రాజ్య ప్రభుత్వం వలసరాజ్యాల దోపిడీ విధానంలో మార్పు తెచ్చి, తన స్థితిని సర్దుకుంటుంది. వలస రాజ్యాలనుంచి సామ్రాజ్య ప్రభుత్వానికి ఏం కావాలి? వలస రాజ్యాల కృషిని ఉపయోగించు కోవడమే సామ్రాజ్య ప్రభుత్వము యొక్క ముఖ్యోద్దేశం. కృషివల్లనే అన్నీ (వాల్యూస్) ఉత్పన్న మౌతాయని చూచాం. కృషిని దోపిడీచేసే పద్ధతి మీదనే లాభాలు ఆధారపడి వుంటాయి. పూర్వం జమీందారీ ఆర్థిక విధానంద్వారా వ్యవహరించి హిందూదేశపు కృషివల్లనే సామ్రాజ్య ప్రభుత్వం ఎక్కువ లాభాలు సంపాదించింది. రానురాను ఇంకా లాభాలు యెక్కువ కావలసి వచ్చాయి. కాపిటలిజం మూడు పువ్వులు ఆరు కాయలుగా వున్నప్పుడు వలస రాజ్యాలు కేవలం భవిష్యత్తులో లాభాల నీయగలిగి వుంటాయి. సామ్రాజ్య ప్రభుత్వం, అవసరమైనపుడు లాభాలు తీసుకోనటానికి వీలుగావుండే ఖజానా పెట్టెలుగా వాడుకోటానికే వలస రాజ్యాలను సంపాదిస్తుంది.

మొట్ట మొదటనే వలస రాజ్యాలలో నుంచి అన్ని లాభాలను ఒకేసారి రాల్చుకోదు. కొన్నిటినే తీసుకొంటుంది. దీనికి వ్యాపారం ఒకటి చాలు. వచ్చే కాపిటలిస్టు విషమపరిస్థితినిబట్టి 'ఇంపీరియలిజమ్'యొక్క నిర్మాణం మారుతుంది. అలాంటి విషమ పరిస్థితుల్లో వలస రాజ్యాల్లోవున్న అవకాశాలను వాడుకుంటుంది. కాపిటలిజమ్ అభివృద్ధి చెందిన కాలంలో, అంటే, 19వ. శతాబ్దం చివరనుండి 1914, 18 దాకా 'యింపీరియలిస్టు' దేశాలనుంచి వలస రాజ్యాలకు కాపిటల్ ఎగుమతి అయింది. ఇది ఆధునిక సామ్రాజ్య విధానానికి ముఖ్యలక్షణం. సామ్రాజ్య దేశాలలో లాభకరంగా పెట్టుబడి పెట్టటానికి వీలైన మొత్తంకంటె ఎక్కువ మూలధనం పోగైంది. పూర్తిగా అభివృద్ధి చెందిన కాపిటలిస్టు ఆర్థిక విధానానికి లాభాలు తక్కువ కావటమనే అపాయం తటస్థించింది. అందువల్ల ఎక్కువ లాభాలు గడించటానికి వీలుగావున్న దేశాలకు కాపిటల్ యెగుమతి అయింది. ఈవిధంగానే ఆధునిక సామ్రాజ్య విధానం బయలుదేరింది. తరువాత ఒక్క అమెరికాలో తప్ప ఇతరదేశాల్లో కాపిటల్ క్షీణింప మొదలుపెట్టింది. దీనికి తోడు, నూతన ఉత్పత్తి సాధనాలు రావడంవల్ల

పారిశ్రామిక యంత్రాలను పూర్తిగా మార్చివేయవలసి వచ్చింది. ప్రాపంచికపు మార్కెట్టులోని పోటీయే దీనికి కారణం. ఇలా జరగటంవల్ల కొత్తగా పోగైన కాపిటల్‌ను దేశంలోనే వినియోగించవలసి వచ్చింది. దీనిఫలితంగా వలసరాజ్యాలకు ఎగుమతయ్యే కాపిటల్ ఆగిపోయింది. ప్రాపంచికపు మార్కెట్టులో ఏర్పడ్డ తీవ్రపు పోటీవల్ల లాభాలుకూడా పడిపోయాయి. కాపిటలిస్టు దేశాలలో పోగయ్యే కాపిటల్ కూడా పడిపోయింది. ఇలా జరగటం వల్లనే సామ్రాజ్య ప్రభుత్వానికి విషమస్థితి యేర్పడింది. అందువల్ల వలస రాజ్యాలలో వున్న అవకాశాలమీద ఆధారపడవలసి వచ్చింది. వలస రాజ్యాలున్న దేశాలు ఈ విషమస్థితి నుంచి బయటపడ గలిగాయి. ఎక్కువ ఉత్పత్తికరంగా వుండే పద్ధతిని, కృషిని వినియోగిస్తే వలసరాజ్యాల దోపిడి యెక్కువ లాభకరంగా వుంటుంది. ఉత్పత్తి సాధనమైన, భూమి యింకా యెక్కువ లాభాలు ఈయ లేక పోయింది. సామ్రాజ్య ప్రభుత్వానికి విషమస్థితి యేర్పడ్డప్పుడూ, కాపిటలిజం కుళ్ళిపోతున్నప్పుడూ, భూమికంటె యితరములైన ఉత్పత్తి సాధనాలను వలస రాజ్యాలలో కూడ ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకత

యేర్పడింది. ఈ విధానాన్నే 'డీకాలనై జేషన్' అంటారు.

ఒకసారి శబ్దాన్ని సృష్టించింతరువాత దానికి అపార్థం తేలికగా లాగుతారు. కాబట్టి 'డీకాలనై జేషన్' అంటే అర్థమేమిటో యింకా స్పష్టంగా చెప్పవలసి వుంది. భూమి ఉత్పత్తిసాధనంగా వున్న హిందూదేశపు ఆర్థిక విధానాన్ని వలసరాజ్యపు ఆర్థికవిధాన మన్నాము. భూమి ముఖ్యమైన ఉత్పత్తి సాధనంకాక, నూతనమైన ఉత్పత్తి సాధనాలను ప్రవేశపెట్టటం వల్లనే మనదేశపు ఆర్థిక విధానం మారింది. ఇప్పటిది, జమీందారీ సంబంధాలను పురస్కరించుకొని సాగిస్తూవున్న వలస రాజ్యపు దోపిడీకాదు. ఈదోపిడీ కొత్తరకపు సంబంధాలను పురస్కరించుకొని సాగింప బడుతూ వుంది. జాతీయ బూర్జువా వర్గానికీ, పైకి వస్తూ వున్న స్వదేశ సంస్థానాధిపతులకూ లాభాలు లభించాయా, లేదా, అన్నది మనకు ముఖ్యవిషయం కాదు. హిందూ దేశపుఆర్థిక నిర్మాణంలోని మార్పేకదా మనకు ముఖ్యం. ఈమార్పు హిందూదేశపు కాపిటలిజానికి లాభం చేకూర్చుతుంది. నిజానికి ఈ మార్పువల్ల

మొత్తంమీద హిందూదేశపు ఆర్థికవిధానం చాల వరకు మార్పు చేయబడింది. కాపిటలిజానికి వచ్చే విషమస్థితి వలసరాజ్యపుటార్థిక విధానంలో మార్పు తెస్తుంది. అంటే, పూర్వంనుంచి వలసరాజ్యాలను దోచుకుంటూ వస్తున్న పద్ధతిని వదలి కొత్తపంథా తొక్కుతుంది. వలస రాజ్యపు ఆర్థికవిధానమూ, జమీందారీ ఆర్థిక విధానమూ ఒకటేనని యింతకు ముందు తెలుసుకున్నాం. అంటే, ఉత్పత్తికి ముఖ్య కారకుడైన వాడినుంచి అతనికి మిగిలే ఫలసాయాన్ని (సర్ప్లస్ ఉత్పత్తి) యావత్తు అపహరిస్తారు నూతన ఉత్పత్తి సాధనాలను ప్రవేశ పెట్టడం వల్ల ఇది మారుతుంది. సామ్రాజ్య ప్రభుత్వ దేశాలలో ఉత్పన్నమయ్యే సరుకులకు మార్కెట్లు కావాలి. అయితే మార్కెట్లు నిలకడగా వుండవు అవి అభివృద్ధి కావాలి. వాటిని అభివృద్ధిచేయడానికి చాల మార్గాలున్నాయి. సామ్రాజ్య విధానం కొనసాగాలంటే, వలస రాజ్యాలను పూర్తిగా బికారి ఫకీరులను చేయటానికి వీల్లేదు; వీటిని సరుకులను కొనగలిగే స్థితిలో ఉంచాలి; లాభాలు సామ్రాజ్య ప్రభుత్వానికి చేరుతున్నంతకాలం ఈసరుకులు వలస రాజ్యాలలో తయారవుతున్నాయా, సామ్రాజ్య ప్రభు

త్వపు దేశాలలో తయారవుతున్నాయా, అన్న ప్రశ్న లతో మనకు నిమిత్తం లేదు.

ఇలా, ఈ విధానాన్ని సాగించి సామ్రాజ్య ప్రభుత్వం హిందూదేశాన్ని పూర్తిగా పారిశ్రామిక దేశంగా తయారు చేయగల్గితే, మన దేశంలో విప్లవం రావాలిసిన అవసరం లేదు. ఎందుకంటే, సామ్రాజ్య ప్రభుత్వమే మన దేశంలో పూర్తిగా పరిశ్రమల్ని ప్రవేశ పెట్టగలిగితే, మన విప్లవ ఆదర్శాలను ప్రవేశ పెట్టవలసి వస్తుంది. కాపిటలిజం విషమస్థితినుంచి బతికి బయట పడగలిగే టట్లయితే, విప్లవం అవసరం లేదు; కాపిటలిజం ప్రాథమిక దశలో ఉండ గానే, ముందు ముందు అది కూలద్రోయ బడుతుందని మార్క్సు చెప్పాడు. కాపిటలిజంలో అంతర్విరుద్ధాలున్నాయనీ, వాటిని పరిష్కరించటానికి వీల్లేదనీ, అతడు గ్రహించాడు. తన తరువాత చాల కాలానికి కాపిటలిజం కూలదోయ బడుతుందని కూడ అతడు యెరుగును. ఈ విధంగానే మన సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని గురించి, సామ్రాజ్య ప్రభుత్వ పతనాన్ని గురించి, ముందేమి జరుగుతుందో చెప్పవచ్చును. సామ్రాజ్య విధానంలో ఎలాంటి లోటుపాట్లు, కష్టనష్టాలున్నా,

తన అంతర్వైరుధ్యాలను కొంతవరకు సరిపెట్టుకోగలిగి,
హిందూ దేశపు ఆర్థిక విధానాభివృద్ధికి పాటుపడే
టట్లయితే సాధారణంగా, దాన్ని కూలద్రోయ టానికి
వీల్లేదు. హిందూ దేశానికి లాభం కలగాలంటే, ప్రజల
ఆర్థిక జీవనం బాగుపడాలంటే, ఉత్పత్తి శక్తులు అభి
వృద్ధి కావాలి. అంటే, ఉత్పత్తి విరివి కావాలి; సరు
కులు యెక్కువగా తయారు కావాలి; ఆ తయారైన
సరుకులు అమ్ముడు పోవాలి. ఇక్కడ మార్కెట్టు
సంగతి, ప్రజల కొనుగోలు శక్తివిషయం వస్తాయి. ఈ
సమస్యలను సామ్రాజ్య ప్రభుత్వం పరిష్కరించ గలిగితే,
అది స్థిరపడి పోతుంది. ఇదే హిందూదేశపు ఆర్థిక
విధానానికి వచ్చే ముఖ్యసమస్య. ఈ సమస్యను పరిష్క
రించ కలిగిన విధానం యేదైనప్పటికీ, అది జాతీయ
విధాన మౌతుంది. ఈ సమస్యను సామ్రాజ్య ప్రభుత్వం
పరిష్కరించ కలిగితే, సామ్రాజ్య వ్యతిరేకపు పోరాటా
నికి తావుండదు.

ప్రతి విధానానికి అనేక మార్గా లుంటాయి.
సామ్రాజ్య ప్రభుత్వాలు కూలద్రోయ బడతా యని
సూచిస్తూ, మార్క్సు యిలా చెప్పాడు: కార్మికులు

సామ్రాజ్య ప్రభుత్వాన్ని కూలద్రోయక ఊరుకుంటే, దానిలో ఎలాంటి అంతర్వైరుధ్యా లున్నా, అవిచ్ఛిన్నంగా సాగుతుంది. అంటే, పురుష ప్రయత్న ముండాలి. విప్లవాలలో చాల ముఖ్యమైనది యీ పురుష ప్రయత్నమే. ఎప్పుడూ పరిస్థితుల్ని గూర్చి మాట్లాడుతున్నామంటే, పురుష ప్రయత్నం చేయక ప్రాలుమాలుతున్నా మన్నమాట. ఎన్ని విధాల పరిణమించటానికి వీలుందో, అన్ని విధాలు తెలుసుకోవాలి. ఒక విధంగా పరిణమించటానికి అవకాశాలు తక్కువగా వుండవచ్చును. అయినా, దాన్ని విడిచి పెట్టటానికి వీల్లేదు. అవకాశాలు తక్కువగా వున్నదే కొన్ని పరిస్థితుల్లో జరగటానికి వీ లుండవచ్చును. సామ్రాజ్య ప్రభుత్వం హిందూదేశంలో ప్రజాస్వామిక విప్లవం తెచ్చే అవకాశాలు చాల తక్కువగా వున్నాయి. అంత మాత్రాన, సిద్ధాంతరీత్యా చర్చిస్తూ వున్నపుడు, దీన్ని త్రోసివేయటానికి వీల్లేదు. అంతా పురుష ప్రయత్నం మీద, అంటే, సరైన రాజకీయ పక్షం బయల్దేరి పని చేసేదానిమీద ఆధారపడి వుంటుంది. అయినా, అత్యల్ప అవకాశాలున్న దాన్నికూడ వట్టి భ్రాంతేనని నేను త్రోసివేయలేను. పురుష ప్రయత్నం, అంటే,

విప్లవ చైతన్యం కలిగి, ఏస్వల్ప అవకాశాన్నయినా పురస్కరించుకొని సామ్రాజ్య ప్రభుత్వాన్ని కూల ద్రోయ కలిగిన సుశిక్షిత రాజకీయపక్షం ఏర్పడలేదు. అసలు అలాంటిది లేదన్నంత అపక్వ స్థితిలో ఉంది. పురుష ప్రయత్నం లేనప్పుడు రాజకీయ పక్షాన్ని ఒక దాన్ని వ్యవస్థాపించాలి. ఇది నిర్వివాదాంశం. అయితే, యిలాంటి పక్షంలో చేరేవారికోసం వెదకాలి. అలాంటి వారు ఎక్కడున్నారు? ఈ ప్రశ్న మనం ఇంతకు ముందు తెల్సుకొన్న సామ్రాజ్య వ్యతిరేకపు పోరా టంలో పాల్గొనేవాళ్ళ దగ్గరకు తీసుకొని పోతున్నది. ఇంతకు ముందే హిందూ దేశంలోని సమాజం ఎలా వుందో చర్చించి తెల్సుకున్నాం. ఏవర్గం సంపూర్ణ చైతన్యం కలిగి విప్లవ విధిని నిర్వహిస్తుంది? ఇప్పుడు మన దేశంలోని రైతులకు రెండు విప్లవాలు కావాలని చెప్పాము. పట్టణవాసం చేస్తూవున్న పెటీబూర్జువా వర్గాన్ని, అంటే, మనలను ప్రభుత్వం సృష్టించింది; ఊడగొట్టిన నాగటిదుంప కోళ్ళనుగా చేసి వేసింది. ఇలాంటి పెటీబూర్జువా వర్గమే పురుష ప్రయత్నాన్ని సరఫరా చేయాలి. <u>పెటీబూర్జువా వర్గం విప్లవానికి</u>

<u>ముఖ్యమైన పురుష ప్రయత్నాన్ని చేకూర్చుతుందన్న నిర్ణయానికి వచ్చాం.</u>

ఈవిషయాలు మన బుద్ధికి గోచరిస్తున్నాయి కాని, బాలాభాయి దేశాయికి గాని, జిన్నాకుగాని, వీర సవర్కారుకు గాని గోచరించటం లేదు. దీనికి కారణం ఏమిటి ? మనకూ, శ్రామికులకూ సంబంధం వుంది. జన్మతః పెటీబూర్జువా వర్గానికి చెందినవారి బుద్ధికి ఈ విషయాలు గోచరిస్తాయి. నా బుద్ధి కార్మికుల నాయకత్వాన్ని ప్రకటించే సాధనంగా వుంది. అలాంటి బుద్ధిని నిరుత్సాహ పరచి కార్మిక విప్లవం కావా లనటంలో అర్థం లేదు. విప్లవానికి ముఖ్య మయిన పురుష ప్రయత్నానికి కొన్ని అవసరంగా వుండాలి. అంటే, కొంత విద్య, కొంత నాగరికత వుండాలి. చైతన్యం ఏర్పడా లంటే బుద్ధి కావాలి. హిందూదేశంలో విప్లకారులుగా వున్న కార్మిక కర్షకుల్నీ, పెటీబూర్జువాలనూ తీసుకొంటే, విప్లవానికి కావాలిసిన విషయాలు ఒక శాఖ వారిలోనే కనిపిస్తాయి. మనలోని ప్రతివాడు ఈ శాఖకే చెందుతాడు. మనలోని ప్రతివాడు సోషలిజం కోసం తీవ్రంగా పోరాడేవాడే. అయినప్పటికీ, మనలో ఒక్కడైనా కార్మిక వర్గానికి చెందినవాడు లేడు. ఇది నేటి

హిందూదేశపు పరిస్థితుల్లో కనిపించే ముఖ్యమైన సత్యం. దీన్నిబట్టే సామ్రాజ్య ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరగవలసిన పోరాటంలోని వర్గసంబంధాలను నిర్ణయించాలి.

కార్మిక—కర్షక—పెటీబూర్జువాలకు వ్యతిరేకంగా మరోపక్షముంది. భూమిగాని, మిల్లులుగాని, గనులుగాని, మరెలాంటి ఉత్పత్తి సాధనాలుగాని యీపక్షం వారి చేతుల్లో వున్నాయి. సామ్రాజ్య ప్రభుత్వం అవలంబించే వలస రాజ్యపుటార్థిక విధానానికి లోబడి, యీ ఉత్పత్తి సాధనాలమీద యీ పక్షంవారు అధికారాన్ని పొందారు. అందువల్ల సామ్రాజ్య వ్యతిరేకపు పోరాటంలోని వర్గసంబంధాలను విచారిస్తే, యీపక్షం వారు సామ్రాజ్య ప్రభుత్వంతో కలుస్తారు. ప్రజాసామాన్యంలో స్వల్పభేదాలున్నాయి. అయినా ప్రజలు ఏకీభవిస్తారు. ఈ ఏకీభవించేశక్తి సామాజిక సంబంధాల్లో వుంది. అందువల్ల ప్రజలు ఏకీభవించి సామ్రాజ్య విధానానికి వ్యతిరేకులౌతారు. కాని వీరిలో ఉన్న వర్గవైరుధ్యం ఎక్కువైతే మాత్రం, ఈ ఐక

మత్యం చెడి కొంతమంది శత్రుకోటిలో చేరవచ్చును. కాబట్టి జమీందారీ, కాపిటలిస్టు, ఇంపీరియలిస్టు శక్తులకు వ్యతిరేకంగా జరుగవలసిన పోరాటానికి ప్రజా సామాన్యంలోనే ఐకమత్యం చాలాముఖ్యం. అందువల్ల మన ఉద్యమం ఇలాంటిదశలో ఉన్నప్పుడు, వర్గసంఘర్షణాలను ఎత్తుకోడం, కేవలం, అనర్థదాయకం. వర్గసంఘర్షణ అనేది కాపిటల్ కీ, కృషికీ మధ్యనేకాక ఇతరత్రా కూడ వున్నదని తెలిసినపుడు మరీ అనర్థం కలుగుతుంది. ఒకప్రక్క శ్రామికులకూ, పెటీబూర్జువాయిజీకీ, మరొకప్రక్క పేదిద్దరికీ, కర్షకులకూ, వర్గసంఘర్షణ ఉండటానికి ఎక్కువ అవకాశాలున్నాయి. నేటి హిందూదేశంలో చాలామంది యిలాంటి పోరాటంలో తగులుకున్నారు. ఈ పోరాటాన్ని వృద్ధిచేయటమంటే, విప్లవద్రోహం చేయటమన్నమాట; విప్లవ బలాలను చీల్చి దుర్బలం చేసి, నాశనం చేయటమన్నమాట.

విప్లవం కోసం మనం చేసే ప్రచారంలో అర్థముండాలి. వర్గపోరాటానికి ప్రాముఖ్యమిస్తూ శ్రామికులూ

కర్షకులూ ఏకం కావాలనటంలో అర్థం లేదు. సంయుక్త పోరాటానికి, ట్రేడ్ యూనియన్లు, కిసాను సభలు ముఖ్య మంటారు. కర్షకుల లాభాలకోసం ప్రయత్నిస్తే, శ్రామికుల లాభాలు దెబ్బతింటాయి. శ్రామికుల లాభాల కోసం ప్రయత్నిస్తే, కర్షకుల లాభాలు దెబ్బతింటాయి. శ్రామికులకూ, కర్షకులకూ మధ్యవున్న వర్గవైరుధ్యం తీవ్రసమస్యగావుంది. ఈ సమస్య ఒక్క హిందూదేశం లోనే కాదు, ప్రపంచమంతటావుంది. శ్రామిక కర్షక లాభాలను సాధ్యమైనంతవరకు సన్నిహితంగా తీసుకు రావటమనేది పెద్ద సమస్య. హిందూదేశంలో శ్రామి కులు, కర్షకులు పేదరికంలో మునిగి తేలుతున్నారు. కర్షకులు లాభించాలంటే ధాన్యానికి ధర లేవాలి. ధాన్యానికి ధర యెక్కువయితే, ఆహారపదార్థాలకు ధర హెచ్చుతుంది. అందువల్ల శ్రామికులకు నష్టం. శ్రామికులకు జీతాలు ఎక్కువచేస్తే మిల్లు యజమాని సరకులకు ధర పెంచుతాడు. అంటే, యెక్కువగా ఇచ్చిన జీతాలను కర్షకులదగ్గరనుంచి వసూలుచేస్తాడు. ఇంతకూ ధాన్యానికి ధర పెంచకూడ దనికానీ, శ్రామికులకు జీతాలు పెంచకూడదని కానీ నేను చెప్పటంలేదు. సంయుక్తపుపోరాటంసంగతి మనస్సులోఉంచుకోవాలి.

అది అంత తేలికసమస్య కాదు. 'వర్గపోరాటాన్ని' పెంచి తద్వారా సామ్రాజ్యప్రభుత్వ వ్యతిరేకపు పోరాటాన్ని బలపరుస్తామంటంలో అర్థంలేదు. సామ్రాజ్యవిధానాన్ని యెదుర్కొనే సంయుక్త పక్షాన్ని సృష్టించాలంటే, ఐకమత్యకారక విషయాలను నొక్కిచెప్పి ప్రచారం చేయవలసి వుంటుంది. ఈ పరిస్థితుల్లో కేవలం శ్రామికులు, కర్షకులు, పెటీబూర్జువా వర్గానికి చెందిన వ్యాపారస్థులు, చిన్న చిన్న ఉద్యోగస్థులు, పనివాళ్లు, మేధావులు కలసి పోరాట్టానికి వీలుంది. వీరిలో పట్టణాల్లో వుంటూ, పెటీబూర్జువాలుగా వుంటూన్న శ్రామికులు మాత్రమే తమకు కావలసినమేమిటో తెలిసికోగల్గుతారు. ఇప్పటి విప్లవదశలో శ్రామికులు, కేవలం పెటీ బూర్జువా వర్గంగానే నాయకత్వం వహిస్తారు. ఫ్రెంచి మహా విప్లవంలో పారిస్ నగరంలోని శ్రామిక వర్గం ఈ విధంగానే పనిచేసింది. మనదేశంలో ఇంకా బూర్జువా విప్లవం జరగాలిసివుంది. అందువల్ల మన వర్గాలు నిర్వర్తించవలసిన బాధ్యతలు కూడ ముఖ్యంగా అలాగే వుంటాయి.

మనం ఇంకా జమీందారీ సమాజంలో నేవున్నాము. ఈ స్థితి, తనకు విపత్కరంగా వుండటం వల్ల సామ్రాజ్య ప్రభుత్వం మార్చటానికి ప్రయత్నిస్తూ వుంది. జమీందారులు కూడ పరిస్థితులు నానాటికి విషమిస్తున్నాయని గ్రహించి, తమ పద్ధతిని మార్చుకోవా లని చూస్తున్నారు. కాని యీ విధానం జమీందారులకూ సామ్రాజ్య ప్రభుత్వానికీ, లాభకరంగా వుంది కాబట్టి దీన్ని ధ్వంసం చేయటం కానీ, ముఖ్యమైన మార్పులు ప్రవేశపెట్టి దుర్బలపరచటం కానీ, జరుగదు. అక్కడక్కడ ఈ విధానానికి కొన్ని అతుకులు అతకవచ్చును. కాని యీ విధానాన్ని పూర్తిగా నాశనం చేయరు. శ్రామిక కర్షక పెటీబూర్జువాల ముగ్గురికీ, పెటీబూర్జువా వర్గం ప్రతినిధిగా వుంటుంది. వీరి లాభాలే యిప్పటి జాతి కంతకూ లాభాలుగా వుంటాయి. ఇప్పటి మన జాతిలో అధిక సంఖ్యాకులు పెటీబూర్జువాలే. అందువల్ల వీరికి లాభించిం దంటే, మొత్తంమీద జాతి అంతా లాభించిం దన్నమాట. వీరే మన విప్లవ సైనికులు. ఈ సైనిక స్కంధావారంలో ఒక ముఠాకే యెక్కువ చైతన్యముంది. మన మంతా యీ ముఠాలోనివారమే. రాబెన్

పెరీ, మారెట్, డాంటన్‌లు అంతా పెటీబూర్జువాలే. మన దేశంలో తమ కర్తవ్యాన్ని నిర్వహించటానికి ఎవరు సిగ్గు పడతారు? బూర్జువా వర్గం విప్లవాన్ని తేనపుడు, పెటీబూర్జువా దానిస్థానె మాక్రమించి విప్లవాన్ని నిర్వహించింది. శ్రామికులు తమవారేనని పెటీబూర్జువా వర్గం గ్రహించింది. పెటీబూర్జువా వర్గ భాగంగానే శ్రామికులు కూడ పనిచేశారు. శ్రామికు లెక్కువజీతాలు కావాలని కోరలేదు; కేవలం తిండి కావాలని కోరారు. ఇది ఏ ఒక వర్గం కోరికా కాదు. ఇది యావత్సమాజం కోరేదే. ఇలా యేకమైనవారిలో తెలివి తేటలు, నాగరికత, ప్రజా సామాన్యానికి సాధారణంగా కావాలసిన కోరికలను ప్రకటించగల్గిన విద్య, వున్నవారే నాయకత్వం వహించటానికి వీలుంది. హిందూ దేశంలో నేడు వచ్చే విప్లవానికి నాయకత్వం వహించే గౌరవం బూర్జువాయిజీకిగాని, కార్మికులకు గాని సంక్రమించదు; కేవలం జాకోబినులకు సంక్రమిస్తుంది. అంటే, యిప్పు డిప్పుడే బయలుదేరుతూ వున్న కార్మికులకు ప్రథమ శ్రేణిలో వుండి పోరాడే పెటీబూర్జువాయిజీకీ, యీవర్గంలో కేవలం అంతర్భా

గంగానే పని చేసే కార్మికులకూ సంక్రమిస్తుంది.

ఈచర్చవల్ల హిందూ దేశపు విప్లవానికి పురుష ప్రయత్నము ఎవరిద్వారా లభిస్తుందో స్పష్టమయింది. ఈ ప్రయత్నం మనం చేస్తాం. సామాజికంగా, ఆదర్శరీత్యా మనకున్న స్థితి మనకు తెలుసు. మనం కార్మికుల మైనట్లు నటించడం వల్ల ప్రయోజన మేముంది? ఇప్పటి విప్లవాన్ని, సామాజికంగా పెటీబూర్జువాలుగాను, ఆదర్శరీత్యా జాకోబినులు గాను వున్న హిందూదేశపు విప్లవ నాయకులు నిర్వర్తించక పోవచ్చును. కాని వీటన్నిటికంటే, ముఖ్యమైన విషయం ఒకటివుంది. మనమంతా మార్క్సిస్టులం. మార్క్సిజాన్ని నేటి హిందూదేశంలో కేవలం ఇరవయ్యోశతాబ్దపు జాకోబినిజంగానే ఆచరణలోకి తేవాలి. మార్క్సిజాన్ని సరిగా అర్థం చేసుకుంటేనే, యీవిషయాన్ని గ్రహించగలుగుతాము. అప్పుడే నేటి హిందూదేశపు సమాజంలోని వర్గ సంబంధాలను తేల్చుకొని, కర్తవ్యం నిర్ణయించుకో గలుగుతాము.

కల్యాణీ ప్రెస్, తెనాలి. 9—'41.

# చైత్రరథం

( కథలు — నాటికలు )

జి. వి. కృష్ణరావు

ఆ ర ణా లు